# గాంధేయ సోషలిజం

## మానవతా వాదానికి మరో పేరు



కందర్ప రామచంద్రరావు

ప్రథమ ముద్రణ :

నవంబర్ 1982

ప్రచురణ :

వి. రామకృష్ణ
2-2-1088 గోల్నాక,
అంబర్ పేట పోస్టు, హైదరాబాద్-13

ప్రతులకు :

సాహిత్య నికేతన్
3-4-852 బరకత్ పుర,
హైదరాబాద్ - 500 027

ముద్రణ :

భారత ముద్రణాలయం
3-4-705/4 నారాయణగూడ,
హైదరాబాద్ - 500 029

వెల : 5 రు.

# మనవి

భారతీయ జనతా పార్టీ గాంధేయ సోషలిజం తమ ఆర్థిక విధానంగా ప్రకటించగానే అనేకమంది ఆ పదబంధానికి వివరణను కోరారు. వారి నాయకులు తమ ఉపన్యాసాలలో శ్రీ దీనదయాళ్ ఉపాధ్యాయ ప్రవచించిన ఏకాత్మ మానవతావాదం, మహాత్మాగాంధీ సూచిస్తూ వచ్చిన గ్రామస్వరాజ్యం, రామరాజ్యం ఒకటే అని చెప్పటానికి ప్రయత్నిస్తూ వచ్చారు. ఈ విషయంపై విస్తృతంగా చర్చ జరగవలసివుంది ఆ చర్చకు నాందిగా ఒక ముసాయిదాను తయారుచేసి మేధావులముందు, ఆర్థికశాస్త్ర వేత్తలముందు వుంచితే మంచిదని ఒక ఆలోచన కలిగింది.

యోగి శ్రీ అరవిందులు, శ్రీ గురూజీ, పండిత దీనదయాళ్ ఉపాధ్యాయ, మహాత్మాగాంధీ రచనలచే, భావనలచే, కందర్ప రామచంద్రరావు ప్రభావితులయ్యారు. "గ్రామ స్వరాజ్యం" "జయప్రకాశ్" మొదలగు గ్రంథాల రచయితగా "గాంధీ-దీనదయాళ్-లోహియా" అనువాదకునిగా శ్రీ కందర్ప రామచంద్రరావు గారికి గాంధేయ సోషలిజంతో వున్న పరిచయంకూడ పాఠకులకు తెలిసినదే. దానికితోడు సుమారు పాతిక సంవత్సరాలుగా పాత్రికేయులుగా విశేషానుభవాన్ని వారు సంపాదించారు. వారితో ఈ సిద్ధాంతాన్ని గూర్చి ప్రస్తావించగానే వారు ఈ గ్రంథాన్ని తయారుచేయటానికి అంగీకరించారు. వారికి మా కృతజ్ఞతలు.

ఈ గ్రంథ రచనలో ప్రచురణలో తోడ్పడిన పెద్దలకు పిన్నలకు- అందరికీ మా వందనములు

—ప్రకాశకులు

# నివేదన

గాంధీ మహాత్ముని మహత్తు భారతీయ గగన వీధిలో బహు ముఖాలుగా ప్రసరించింది. భారతీయతలోని మూలసూత్రాలను యుగ ధర్మానికి అనుగుణంగా వివిధ జీవనరంగాలకు అన్వయించి ఆయన అనేక సిద్ధాంతాలను ఆవిష్కరించారు. సిద్ధాంతమే తానుగా తానే సిద్ధాంతంగా జీవించి, ఒక మహా సాధనామూర్తిగా సత్యశోధనా తపస్విగా, మకుటం లేని మహారాజుగా భారత ప్రజల హృదయాలలో వెలుగొందిన పావన చరితుడాయన. స్వరాజ్య సమరసారథిగా ఆ సిద్ధాంతాల వరవడిలో మహోద్యమాలు నిర్వహించి తన అద్భుత విజయాలతో ప్రపంచాన్ని ఆశ్చర్యచకితం చేసిన కర్మయోగి ఆయన.

మహాత్ముని బోధనలలో నేటి సమాజానికి వెలుగుదివ్వెలు కాగల మూలసూత్రాల స్థూల పరిశీలన ఈ పుస్తకంలో జరిగింది. యోగి శ్రీ అరవిందులు, పండిత దీనదయాళ్ ఉపాధ్యాయల భావసూత్రాలు ఆలంబాలుగా- రాజ్యవ్యవస్థ సాంకేతికత, ఆస్తిహక్కు, సామాజిక పరివర్తన ప్రక్రియ అనే నాలుగు మౌలికాంశాలపై గాంధీజీ చూపిన వెలుగును నలుగడలా విరజిమ్మే సాహసం యిది.

భారతీయ జీవనదృష్టి అంతర్వాహినిగా జాతిపునరుజ్జీవనానికై వివిధ రంగాలలో జరుగుతున్న కృషిలో అంతర్భాగం కావాలి. ఆ యా రంగాలలో సమగ్ర పరిశోధన ఆ మహాసిద్ధాంత యాత్రకు సన్నాహక చర్యల సందర్భంగా-చంద్రుడికో నూలుపోగుగా, ఉడతాభక్తిగా సమర్పిస్తున్న ఉపాయనం ఇది.

—కందర్ప రామచంద్రరావు

గాంధీజీ జీవనదృష్టి సర్వసమగ్రం, వికాస శీలం. ఆ జీవన దృష్టికి కేంద్రబిందువు- జ్ఞానం కోసం, సత్యం కోసం అన్వేషించే పూర్ణ మానవుడు. ఆ జీవన దృష్టి నుంచి అయిదు మూల సిద్ధాంతాలు ఆవిర్భవించాయి; సత్యం అహింస, స్వదేశీ, కాయకష్టం, సత్యాగ్రహం ......సత్యాన్వేషణ ఆయన మార్గం. ప్రజా సేవ ఆయన విధానం. ఆయన ఆంకాక్షించినది దోపిడి ఏమాత్రం లేని వ్యవస్థ.

—అటల్ బిహారీ వాజపేయీ

# భావ సూత్రం

# 1

# గాడితప్పిన స్వరాజ్యరథం

*విజయం పొందిన ఘడియలోనే మనం గాంధీజీకి అపచారం చేసాం. అంత కన్నా ఘోరం ఏమిటంటే జాతికి అపచారం చేసాం. స్వరాజ్యానికి త్రోవ చూపిన భావనలకు, పథకాలకు అన్నింటికీ ద్రోహం చేసాం... క్రొత్త ఆశలను విశ్వాసాన్ని నిర్మించడానికిబదులు ప్రజలలోని ఆశావిశ్వాసాలను చంపివేసాం*

**జె. బి. కృపలానీ**

*గాంధీజీ మహానుభావుడు. ఒక పరమాద్భుత వ్యక్తి. అయితే పాలిస్తున్న పార్టీలకు వ్యక్తులకు ఆయన అవసరం లేదు ... మనం పెడత్రోవ పట్టాం ఊబిలో దిగబడిపోయాం. ప్రాయశ్చిత్తం చేసుకోవడానికి ధైర్యస్థైర్యాల కోసం మనం ప్రార్థించాలి.*

**రాజాజీ**

మన స్వరాజ్యరథం 1947 లోనే పెడత్రోవపట్టింది. మాతృభూమి విభజనతో స్వరాజ్యానికి పురిట్లోనే సంధికొట్టినట్లుయింది. ఆతరువాత క్రమంగా స్వరాజ్య ఉద్యమ సారథుల మహత్తర ఆశయాలూ, ఆదర్శాలూ అన్నీ గంగపాలైనాయి.

లోకమాన్యతిలక్, యోగిశ్రీ అరవిందులు, మహాత్మాగాంధీవంటి మహామనీషులు చూపిన వెలుగుబాట కనుమరుగైంది. వారిజీవన దృక్పథం

వారి బోధనామృతం, వారి సాధనాపథం—వీటికీ ఈనాటి స్వరాజ్యానికీ కొన్ని కాంతిసంవత్సరాలదూరం ఏర్పడింది.

కనుకనే స్వరాజ్యంఅయితే వచ్చింది కాని స్వ-తంత్రంమాత్రం ససేమిరా రానంటోంది. సిద్ధాంతాలూ, విధానాలూ, కార్యక్రమాలు అన్నింటిలో ఎక్కడా "మనది" అన్నది కలికానికయినా కానరావడం లేదు. అంతా అరువుసరుకు. దిగుమతులైన నినాదాలరొద, పరానుకరణ ప్రతాపం, పరావలంబన పరాయణత్వం, మరోప్రక్క సిద్ధాంతాలను దరి చేరనివ్వని పదవీ రాజకీయాలఎత్తులూ జిత్తులతో కుట్రలూకుతంత్రాలతో సామాజిక వాతావరణం పూర్తిగా కలుషితమైపోతోంది.

ఈ రణగొణ ధ్వనినుంచి, కాలుష్యంనుంచి జాతిని వెలికితీయా లంటే, గాడితప్పిన స్వరాజ్య రథాన్ని రాచబాటమీదికి తేవాలంటే, స్వరాజ్య సమరసారధుల సందేశాలను స్మరించుకోవాలి. ఆ మూల సూత్రాలు ఆధారంగా స్వ-రాజ్యాన్ని సార్థకం చేసుకోవాలి. స్వ-తం త్రాన్ని. భారతీయమైన సామాజిక ఆర్థిక రాజకీయ వ్యవస్థను యుగధర్మా నికి అనుగుణంగా తీర్చిదిద్దుకోవాలి. అలా ఆసందేశాల వెలుగుల వెల్లువ చూపే త్రోవలో స్వరాజ్యరథం నిర్విఘ్నంగా పయనించి రామరాజ్య స్థాప నలో పర్యవసించాలి.



# 2

# గాంధీజీ చూపిన వెలుగు

*గాంధీజీ గొప్పతనం ఆయన జరిపిన వీరోచిత పోరాటాలలో కన్న ఆయన పావన జీవనంలో అధికంగా ఉంది. విధ్వంసక శక్తులు విజృంభిస్తున్న తరుణంలో సృజనాత్మక శక్తికి, చైతన్య లక్షణానికి ఆయన ఇచ్చిన గౌరవ గరిమలో ఆ గొప్పతనం ఉంది.*

యస్. రాధాకృష్ణన్

మానవ జాతి మహా వృక్షాన పూచిన మంజుల కుసుమం మహాత్మా గాంధీ. ఆయన రాజనీతికోవిదుడు; ద్రష్ట; ఋషి; ప్రాతఃస్మరణీయుడూను.

## నైతిక సాధనాల ద్వారా సామాజిక పరివర్తన

గాంధీజీ జీవన దృష్టిపై ఆచార్య కృపలానీ ఇలా వ్యాఖ్యానించారు:

"గాంధీజీ ప్రధానంగా సంస్కర్త. నైతిక ఆధ్యాత్మిక విలువలు ఆధారంగా సమాజంలో పరివర్తనకు మార్గం చూపిన మహా మనిషి. ఆధ్యాత్మిక విలువలకు సాధనా క్షేత్రం సామాజిక జీవనం. ఆదర్శాలు వ్యక్తి జీవితంలోనూ సామాజిక జీవనంలోనూ ప్రతిబింబించాలి. అందువల్ల కష్టం వచ్చినా సుఖం వచ్చినా గెలుపు వచ్చినా సత్కర్మలు చేసే వ్యక్తి ఎన్నడూ చెడిపోడు—అనే గీతావాక్యం గాంధీజీకి పరమ ప్రమాణం."

న్యాయం, ఔదార్యం, సమానత్వం అనేవి ప్రధానమైన నైతి సూత్రాలు. నైతిక సాధనాల ద్వారానే ఆ సూత్రాలను అమలు పర గలుగుతాం. యాంత్రిక మయిన పద్ధతులూ సంస్థాగతమైన ఏర్పా అందుకు దోహదం చేసేవి మాత్రమే. నీతిని వదలిన సామాజిక వ్యవ ఇసుక మేడ వంటిదని గాంధీజీ నమ్మకం.

తన స్వభావానికీ స్వధర్మానికీ సంస్కారానికీ అనుగుణమై మార్గంలో మన సమాజం పురోగమించాలన్నది ఆయన ప్రబోధం. ఆయ దృష్టి సమగ్రమూ ఏకాత్మకము. ఆ దృష్టిలో నీతి, సంఘ సంస్కర ఆర్థిక శాస్త్రము రాజకీయ రంగంతో విడదీయరాని విధంగా ముడిప ఉన్నాయి.

## స్వేచ్ఛ + న్యాయం + ప్రేమ = గాంధీజీ

గాంధీజీ ప్రతిపాదించిన ప్రధాన సిద్ధాంతాలు ఏవి?

లోకనాయక్ జయప్రకాశ్ నారాయణ్ దృష్టిలో గ్రామ స్వరాజ్ ధర్మ కర్తృత్వం సత్యాగ్రహం గాంధీజీ మూల సిద్ధాంతాలు.

ప్రముఖ ఆర్థిక శాస్త్రవేత్త డాక్టర్ పి. ఆర్. బ్రహ్మానంద గాంధీ సిద్ధాంతాలను పది సూత్రాలలో వర్గీకరించారు: (1) స్వరాజం, స్వ (2) సర్వధర్మ సమభావం (3) ప్రేమ, సహజత్వం, స్వచ్ఛంద సే (4) స్వేచ్ఛాయుత సమాజం (5) మానవతావాదం (6) స్వయంప్ర పత్తి (7) అట్టడుగుస్థాయినుంచి సాంఘిక న్యాయం (8) సామాజిక ధ కర్తృత్వం (9) సాత్వికతతోకూడిన భౌతికవాదం (10) పరిసరాల సమన్వయం సమతూకం.

ప్రణాళికాసంఘం మాజీసభ్యులు శ్రీ జె. డి. సేఠీ దృష్టి గాంధేయసూత్రాలు ఆరు: సత్యం, అహింస, సత్యాగ్రహం, స్వదే సమానత్వం, కాయకష్టం.

హరిజన్ పత్రిక సంపాదకులుగా పనిచేసిన గాంధేయ సిద్ధాంతి శ్రీ కే. జె. మష్రువాలా దృష్టిలో వర్ణధర్మం, ధర్మకర్తృత్వం అనేవి గాంధేయ సూత్రాలు. ఆచార్యవినోబా ధనపిశాచిను౦చి విముక్తి, శ్రమదేవత ఆరాధన గాంధీజీ సిద్ధాంతసారంగా వర్ణించారు. స్వేచ్ఛ, న్యాయం, మానవప్రేమ గాంధీజీ ఊపిరి అంటారు డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్.

డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య గాంధీతత్వంపై ఇలా వ్యాఖ్యానించారు: ".గాంధీయిజం ఓ క్రొత్తమతంకాదు. హిందూధర్మానికి ప్రధానమైన ఆధ్యాత్మిక నైతిక సూత్రాలకు అనుగుణంగా శతాబ్దాల క్రిందట రూపందాల్చిన సామాజికవ్యవస్థ అది. దాని సంపూర్ణస్వరూపాన్ని ఆధునిక పరిస్థితులలో దాని తీరుతెన్నులను ఆయన దివ్యదృష్టితో చూడగలిగారు.

## సోషలిజం సాధనాలు

సోషలిజం ఒకఅందమైన పదం. అందులో సమాజంలోని వ్యక్తులంతా సమానం... శరీరంలోని అవయవాల వలె సమాజంలోని వ్యక్తులు కూడ సమానమే... ఈ సోషలిజం స్ఫటికంలా స్వచ్ఛమైంది కనుక దీని సాధనాలు కూడా స్ఫటికంలా ఉండాలి....సత్యవంతులు నిర్మల హృదయులు అహింసా పరులు మాత్రమే ఎక్కడైనా ఎప్పుడైనా సోషలిస్టు సమాజాన్ని నిర్మించ గలరు. "అంటారు గాంధీజీ.

ప్రజాస్వామ్యం సమాజంలో వ్యక్తికుండే నైతిక విలువలను గురించి నొక్కి చెబుతోంది. సోషలిజం ఆర్థిక రంగంలో సమానత్వాన్ని ప్రకటించే ఒక నైతిక సూత్రం. ఇలా ప్రజాస్వామ్యము సోషలిజం కూడా న్యాయం, సమానత్వం ఔదార్యం అనే సూత్రాల పైనే ఆధారపడి ఉన్నాయి. సత్యం, అహింస న్యాయం ఔదార్యం అనే లక్షణాలు వైయ

క్తిక సామాజిక జీవనంలో ఆంతరిక బాహ్య ఆర్థిక రాజకీయ రంగా లన్నింట్లో మూల సూత్రాలు కావాలని గాంధేయవాదం కోరుతోంది. ఆ విధంగా నైతికమైన సామాజిక వ్యవస్థ ఏర్పడాలని కూడా గాంధేయ వాదం కాంక్షిస్తుంది. ప్రజాస్వామ్య, సోషలిస్టు సిద్ధాంతాలలోని నైతిక భౌతిక ప్రయోజనాల సమన్వయం అలా జరుగుతోంది.

## మంచితనానికి ప్రేరణ ఏది ?

భౌతిక వాదం ఆధారంగా సోషలిజం తన లక్ష్యాలను సాధించ లేదు. స్వేచ్ఛ సమానత్వం సోదరత్వం శాంతి అనే సోషలిస్టు ఆదర్శా లకు నైతికత ఆధారం కావాలి భౌతిక వాదం ఒక్కటే మంచితనానికి ప్రేరణ ఇవ్వలేదు. మనిషి, మనిషిలోని చైతన్యం, సమాజం, సంస్కృతీ అన్నీ పదార్థానికి వివిధరూపాలే ఐతే-మంచితనం, దయ, ఔదార్యం, స్వార్థ రాహిత్యం వంటి గుణాలను ఎందుకు పెంపొందించు కోవాలి —అంతా జడమే అయితే మంచితనానికి ప్రేరణ ఏముంటుంది.

జడ పదార్థాల మీద కోరిక వస్తువుపై ఆధారపడి యుంటుంది. చైతన్యం వ్యక్తి అనుభూతికి సంబంధించింది. ఈ రెంటికీ గల తేడాని గుర్తించకపోతే నీతికి పునాది కూడా మిగులదు. శాస్త్ర విజ్ఞానానికి చైత న్యాన్ని అర్థం చేసుకునే శక్తి లేదు. అది వ్యక్తిగత అనుభూతి ద్వారా మాత్రమే తెలుసుకోగలం వస్తువు గురించి ఆలోచించే టప్పుడు వస్తువు వేరు ఆలోచించే వాడు వేరు. కానీ అనుభూతిలో అనుభవాన్ని పొందే వాడూ అనుభూతి వేరువేరుకాదు, రెండూ ఒకటే ఔతాయి. ఈ విషయాన్ని అర్థం చేసుకోవటంలోనే నైతికతకు మనం ఇచ్చే విలువ ఆధారపడి ఉంది.

## నిగ్రహం లేనిదే పంచుకోవడం ఎలా ?

కేవలం భౌతికసుఖాలను ఆరాధ్యాలుగా పరిగణిస్తూ భౌతిక సుఖ సాధనాలను పెంచుకుంటూపోయే జీవనదృష్టిని ప్రోత్సహించడంవల్ల

ప్రయోజనం లేదు. ఆ ధోరణి మనిషి మనసునూ హృదయాన్నీ పురుగులా తొలుస్తూ ఉన్నంతకాలం అతనికి శాంతిఉండదు. అంతేకాదు మితిమీరిన పోటీ పుట్టుకవస్తుంది. హింసాయుద్ధం మొదలవుతాయి స్వేచ్ఛ సమానత్వం బంధుత్వం శాంతి మంటగలుస్తాయి. సమభావం ఆనందం కరువవుతాయి.

కనుక శారీరకవాంఛల అదుపు, ఆత్మనిగ్రహం నైతిక జీవనానికీ మానవ వ్యక్తిత్వ వికాసానికీ మానవత్వపు వికసనానికీ అవసరం. అందరి కృషిద్వారా ఉత్పత్తి అయ్యే వస్తువులను అందరూకలిసి పంచుకోవటమే సమాజవాద జీవనపద్ధతి. ఈ పంచుకొనేలక్షణం సమాజంలో ఏమేరకు స్వేచ్ఛగా స్వచ్ఛందంగా ఆచరణలోనికివస్తే ఆ మేరకు ఉద్రిక్తతలూ ఒత్తిళ్ళూతగ్గి సమాజవాదం పెరుగుతుంది. వ్యక్తి తనకుతానుగా అనుశాసనాన్ని పాటిస్తే, పరస్పర సహకారంతో అనుకూలభావంతో జీవిస్తే ఇంకొకరు అనుశాసనాన్ని అమలుచేసేఅవసరం తగ్గుతుంది.

ప్రభుత్వంతో ప్రమేయంలేకుండా తమ వ్యవహారాలు తాము చూచుకునే సామర్థ్యాన్ని నిర్మాణంచేయాలి. ప్రభుత్వంద్వారా కాక ప్రజల స్వచ్ఛంద కృషిద్వారా సమాజవాద జీవనాన్ని వికసింపజేయాలి. రాజకీయ సమాజవాదానికి బదులు ప్రజల సమాజవాదాన్ని స్థాపించాలి.

అప్పుడు మానవతావాదం అంతర్వాహినికాగా సమాజవాదం గాంధేయవాదంతో కలుస్తుంది.

గాంధేయసోషలిజంలోని స్వదేశీ, గ్రామస్వరాజ్యం, ఆర్థిక వికేంద్రీకరణ, కరణ, ధర్మకర్తృత్వం, సత్యాగ్రహం అనే అయిదుమూల సూత్రాలను విడివిడిగా పరిశీలిద్దాం.

# 3

# తారక మంత్రం స్వదేశీ

*కోర్కెలను అవి తీర్చుకొనే మార్గాలను విపరీతంగా పెంచుకోవటం కాక వాటిని సక్రమంగా మలచుకోవటమే నాగరికత. మనుషుల జీవితాలను కాక వస్తువుల ఉత్పత్తి ముఖ్యం అనుకొనే జాతి నశిస్తుంది.... మనుషులకు వివేకం సంతోషం కలిగించే ఆర్థిక రాజకీయ వ్యవస్థ నుండి స్వదేశీ ఉద్యమం ప్రేరణ పొందాలి."*

ఆనందకుమారస్వామి

## గాంధీజీ నిర్వచనం

"స్వదేశీ అంటే నిత్యజీవితంలో స్వధర్మాన్ని పాటించటం స్వధర్మాన్ని గురించి భగవద్గీత చేసిన వ్యాఖ్యానం స్వదేశీకి కూడా వర్తిస్తుంది.

"ఆధ్యాత్మికంగా స్వదేశీ అంటే భవబంధాలనుంచి ఆత్మకు విముక్తి కలుగటం ఆత్మ తన స్వస్థలానికి చేరుకోవటం.

"ఇరుగు పొరుగున ఉన్న పరిసరాలను వినియోగించటానికి పునికొల్పే భావనే స్వదేశీ భావన.

మతపరంగా పూర్వీకులమతానికి కట్టుబడి ఉండి, రాజకీయాలలో దేశీయమూ స్థానికమూ అయిన పద్ధతులను అనుసరిస్తూ, వాటిలో లోపాలేమైనా ఉంటే తొలగిస్తూ ఆర్థిక రంగంలో ఇరుగు పొరుగున వారు తయారు చేసే వస్తువులను వాడుతూ ఉండటమే స్వదేశీ భావన. అంటారు గాంధీజీ.

గాంధీజీ దృష్టిలో స్వదేశీ ఒక జీవనసూత్రం; జీవన ధర్మం.

స్వదేశీ అంటే వ్యక్తిగతంగా సామాజికంగా స్వావలంబన. మన కాళ్లమీద మనం నిలబడటం. గ్రామాల స్వావలంబన దేశ స్వావలంబన అని మనం అర్థం చేసుకోవాలి.

## సంస్కృతి రక్షణకు స్వావలంబన

నేటి ప్రపంచపు తీరు తెన్నులు గమనిస్తే స్వదేశీ వ్రతం పాటించటం తప్పనిసరి అని అర్థం అవుతుంది. ప్రస్తుతం అందుబాటులోఉన్న సాంకేతిక పరిజ్ఞానంతో ప్రపంచంలోఉన్న దారిద్ర్యాన్నంతా పూర్తిగా నిర్మూలించవచ్చు. అయితే ఈపని జరగటంలేదు. సాంకేతిక పరిజ్ఞానం. అందువల్ల లభించే సంపద కొద్ది దేశాల చేతుల్లో మాత్రమే ఉండి పోయాయి. సంపన్న దేశాలు తను మొత్తం ఉత్పత్తిలో ఒక్కశాతం పేదదేశాలకు బదిలీ చేయటానికి తాతలు దిగివస్తున్నారు. ఆ రవ్వంత సహాయం కూడ పేదరికాన్ని తొలగించటానికి కాక, ఆపేద దేశాలలో తమ కీలుబొమ్మల చేతుల్లో అధికారాన్ని నిలిపి ఉంచడానికి మాత్రమే చేస్తున్నారు ఈ స్థితిలో స్వావలంబనతో కూడిన ఆర్థికాభివృద్ధికై ప్రయత్నం చేయటం తప్ప మరో దారిలేదు. అలా చేయనినాడు దేశాన్ని కుదవపెట్టవలసి వస్తుంది. స్వదేశీ భావనలో మన సాంస్కృతిక వారసత్వాన్ని రక్షించుకోవాలనే దీక్షకూడా ఉంది. మనలో నేడు ఈ దీక్ష ఎక్కడఉంది? మన రాజ్యాంగంలో ప్రాచీన భారతీయ రాజ్యవ్యవస్థ మూలసూత్రాల ఛాయలైనా కానరావు. మన పరిపాలన, విద్యాబోధన నేటికీ పరాయి భాషలోనే సాగుతున్నాయి. ప్రధానంగా మన ప్రణాళికలు విదేశీ అనుకరణలే. జీవన విలువలను భావితరానికి అందించటం విద్య యొక్క పరమార్థం కావాలి. మన విద్యా విధానంలో భారతీయ జీవన

మూల్యాలను ప్రసారం చేసే లక్షణమే గోచరించదు. మన అణుశక్తి కేంద్రాలకు ఆధారం విదేశీ ఇంధనం. మన దేశం విదేశీ బ్యాంకులను, బహుళజాతి సంస్థలకు విహార భూమిగా మారింది.

చైనా భాష ప్రపంచ భాషగా ఐక్యరాజ్యసమితి గుర్తింపు పొందింది. మరి మన భాషలు ఆస్థానం పొందాయా? చైనీయుల ఆక్యుపంచర్ వైద్యవిధానం ప్రపంచవ్యాప్తి పొందింది. కానీ మన ఆయుర్వేదం అలా ఖ్యాతిని పొందగలిగిందా? కబడ్డీ వంటి మన క్రీడలకు ప్రపంచస్థాయిలో ఒక స్థానం కల్పించగలిగామా?

స్వదేశీ సిద్ధాంతంనుంచి ఎంతదూరం పోతున్నామో సూచించే పరిణామాలు ఇవన్నీ.



# 4

# గ్రామస్వరాజ్యం ఒక ప్రేమ సామ్రాజ్యం

*"గ్రామపంచాయితీ మన సామాజిక ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకగా ఉంటూ వచ్చింది. అఖండ మండల పరిధిలో తుదినర్తులమైన పంచయితీలే అష్టప్రధాన్ సమితిని ఎన్నుకునేవి. ఆ మంత్రివర్గం సలహాపై రాజు పరిపాలన జరిపేవాడు."*

—యం. యస్. గోళ్వాల్కర్

## ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు భారత్

స్వదేశీ భావనను రాజకీయ రంగానికి అన్వయిస్తే ఆవిర్భవించేది గ్రామస్వరాజ్య సిద్ధాంతం.

"ప్రపంచంలోని వివిధ దేశాల అనుభవంనుంచి మనం గుణపాఠాలు నేర్చుకోవలసిందే. అయితే ఈ దేశపు మట్టికి అనుగుణం కాని సిద్ధాంతాలనూ, వ్యవస్థనూ మన ప్రజా జీవనపు పునాదుల్లో తెచ్చి నాటటం ఫలప్రదమూ కాదు; మన రాజ్యవ్యవస్థ సహజ సిద్ధంగా చైతన్యవంతంగా ఆరోగ్యప్రదంగా వికసించటానికి దోహదకారీ కాదు.

"మన సమాజం యుగయుగాల చరిత్రలో ఎన్నెన్నో పరివర్తనలు పొందింది. ఐనా భారతీయ ఆత్మ అఖండజ్యోతిగా వెలుగుతూనేఉంది.

"భారతీయ జీవన ప్రవాహం నిరాటంకంగా సాగిపోతూ వచ్చింది. ఆ ప్రవాహం ఒకోసారి భూగర్భంలోకి పోయింది కూడా. అయినా అంతర్వాహిని అయిన సరస్వతీ నది వలె మన ఆంతరంగిక జీవన ప్రవాహం పరాజయం పతనం అనే ఇసుక మేటల అడుగున స్వచ్ఛంగా అఖండంగా ప్రవహిస్తూనే యుంది.

"ఆ అఖండ జీవనంలో దాగివున్న స్రోతస్సుల నుంచి పోషణ పొందాలి. మనం ఈనాడు నిర్మించే రాజకీయ వ్యవస్థలు ఆ అఖండ ఆత్మతో సమన్వయం పొందాలి. ఏ స్రోతస్సులు దానిని సజీవంగా నిలపి ఉంచాయో వాటికి పోషణ అందించాలి అంటారు జయప్రకాశ్. "

ఇదీ స్వదేశీయ భావనకు గీటురాయి.

ఇలా వెను తిరిగి చూచుకున్నప్పుడు ప్రజాస్వామ్యానికి పుట్టినిల్లు మన దేశమేననీ, మన గణ రాజ్యాలు కొన్నింటికి వేలాది సంవత్సరాల చరిత్ర కలదనే వెల్లడవుతుంది. గ్రామ సముదాయాలు నగర సముదాయాలు, వృత్తి సముదాయాలు, వర్తక సముదాయాలు ప్రజాస్వామ్యానికి పట్టుగొమ్మలుగా విలసిల్లాయని విదితమవుతున్నది.

## అథర్వ వేదంలో "సభ"

సుదీర్ఘమైన ఈ చరిత్రకు మొదలు ఎక్కడ? మన జాతి సహజ లక్షణం ఏమిటి? వికాస క్రమం ఎలాంటిది?

అదర్వ వేదంలో ఉన్నది ఈ ప్రశ్నకు జవాబు. ఆ వేదం ప్రకారం మొదట ప్రజ మాత్రమే ఉన్నది. సంస్థలు అనేవి లేవు మొట్ట మొదట గార్హ్యపత్య స్థితి వికాసం పొందింది. అంటే వివాహ వ్యవస్థ ప్రారంభమయింది, కుటుంబ వ్యవస్థ కూడా ప్రారంభమయింది. ఆ

తర్వాత ఆవహనీయ వ్యవస్థ అంటే యజ్ఞ వ్యవస్థ ఏర్పడింది. ఆతర్వాత సభ అంటే గ్రామ సభ ఏర్పడింది. ఆ తర్వాత రాష్ట్ర సమితి, ఆమంత్రణ పరిషత్ (మంత్రి మండలి) ఏర్పడ్డాయి.

అటు పిమ్మట పరిస్థితులకు ప్రతిభకు అనుగుణంగా సామ్రాజ్యం, భోజ్యం, స్వారాజ్యం, వైరాజ్యం, పారమేష్ట్యం, రాజ్యం, మహారాజ్యం, ఆధిపత్యం వంటి వివిధ రాజ్య వ్యవస్థలు ఏర్పడ్డాయి. ఈ వ్యవస్థలన్నింటికీ శ్రీకారం చుట్టిన వారు రాజకీయ వాదులు కారు, ఆత్మజ్ఞానులైన మహర్షులు.

## పరస్పర అవలంబనం యజ్ఞ చక్రం

అధర్వ వేదంలో పేర్కొన్న యజ్ఞ వ్యవస్థలోని మూల సూత్రాన్ని దీనదయాళ్ ఉపాధ్యాయ ఇలా వివరించారు: వ్యష్టి (వ్యక్తి) సమిష్టి (సమాజం), సృష్టి. పరమేష్టి (పరమాత్మ) అనేవి నాలుగు తత్వాలు, వ్యక్తి సమాజం మీద, సమాజం సృష్టిమీద, సృష్టి సంచాలన పరమాత్మ మీద ఆధారపడి ఉన్నాయి. పరమాత్మ సంకల్పానికి సాధనం కావడంలో వ్యక్తి ధన్యత్వాన్ని పొందుతాడు. ఈ పరస్పర అవలంబనమే యజ్ఞచక్రం ఇతరుల పట్ల తమ కర్తవ్యాన్ని నిర్వహించటంలో అవసరమయ్యే పరస్పర అనుకూల దృష్టితో జీవితంలో ఉద్యమించటం యజ్ఞం. ఇదే మతానికి ధర్మానికి మూలం.

## ధర్మ రక్షణకే రాజ్య వ్యవస్థ

రాజ్య వ్యవస్థ ఏర్పడిన తీరును మహాభారతంలోని శాంతి పర్వంలో ఇలా వర్ణించారు. అతి ప్రాచీన కాలంలో రాజు లేడు అది కృతయుగం. అంతా ధర్మమే. ప్రజలంతా ధర్మాన్ని అక్షరాలా అనుసరించే వారు. ఒండొరుల హితాన్ని దృష్టిలో వుంచుకొని వ్యవహరించే వారు. ధనం పట్ల లోభం వుండేది కాదు. రాజు యొక్క అవసరమే లేక

పోయింది. కాలాంతరంలో మోహం తలెత్తింది. అందులో నుంచి లోభం, కామం, రాగం పుట్టుకొచ్చాయి. ధర్మం లోపించిందా అనిపించింది. మత్స్య న్యాయం- పెద్ద చేపను చిన్న చేపను మింగి వేసే లక్షణం- అమలు జరిగింది, అప్పుడు ఋషులంతా కలిసి మనువు వద్దకు వెళ్ళి రాజువు కావలసిందని ఆయనను కోరారు. దండ నీతి వల్ల ప్రజలకు కలిగే పుణ్యంలో ఒక పాలు రాజుకు చెందుతుందని ప్రజాపతి నచ్చ చెప్పిన మీదట మనువు అందుకు అంగీకరించాడు.

అధర్వవేదంలోని వికాసక్రమం వర్ణనను, యజ్ఞచక్రం వ్యాఖ్యను, శాంతిపర్వంలో రాజ్య వ్యవస్థ ఆవిర్భావ వర్ణన ఘట్టాన్ని సమన్వయించు కుంటే మూడు అంశాలు స్పష్టమవుతాయి. (1) రాజ్యవ్యవస్థ సమాజం వికసింపజేసుకున్న అనేక వ్యవస్థలలో ఒకటి (2) పరస్పర అనుకూలత నుంచి ధర్మం ఉదయిస్తుంది. (3) ధర్మరక్షణకోసం రాజ్యవ్యవస్థ ఏర్పడింది,

## చితి — విరాట్ — ప్రకృతి

సృష్టిలో జాతులు ఎలా ఏర్పడతాయి. ఎలా తమ జీవితాన్ని రూపు దిద్దుకుంటాయి అనే విషయంలో భారతీయ సిద్ధాంతాన్ని పరిశీలిస్తే పై అంశాలు మరింత స్పష్ట మవుతాయి. ఆ సిద్ధాంతమిలా వున్నది.

సృష్టిలోని ప్రతి జాతి ఒక జీవన లక్ష్యంతో జన్మిస్తుంది. మనిషి తనను తాను తెలుసుకోవటం, జీవితాన్ని వికసింప జేసుకొని అధ్యాత్మి కతను పెంచుకోవటం- ఇదీ మన జాతి జీవన లక్ష్యం. (యోగి శ్రీ అరవిందులు- ఇండియన్ పాలిటి)

ప్రతి జాతికీ ఒక ఆత్మ ఉన్నది. జాతి ఆత్మను శాస్త్రీయ పరి భాషలో 'చితి' అంటారు. చితి జాతికి మూల తత్త్వం, ప్రాణ శక్తి. జాతి

జడం కాదు. చేతనం, జీవం కలిగినది. జాతి స్వయం భువు— తనకు తానుగా ప్రకటితమైనది.

చితి వలన జాగృతమై ఒకటయిన సామాజిక ప్రాకృతిక క్షాత్ర శక్తినే విరాట్ అంటారు. చితి రాష్ట్ర పురుషుని ఆత్మ. విరాట్ రాష్ట్ర పురుషుని ప్రాణం. (దీనదయాళ్ ఉపాధ్యాయ- రాష్ట్ర జీవన్ కీ దిశా)

ప్రతి ప్రాణి సహజంగా వికసిస్తుంది. ఎదుగుతుంది. జాతి ఒక ప్రాణి కనుక తన జీవన లక్ష్యాన్ని సాధించటం కోసం క్షేత్ర పరంగా వృత్తి పరంగా, మరో విధంగా వివిధ సముదాయాలు చైతన్యాన్ని పొందుతూ వుంటాయి. సముదాయాల పరిశోధనలోనే కాని, జీవ చైతన్యంలో, స్పందనలో తేడా ఉండదు. ఆ స్పందన వివిధ సముదాయాలలో పరస్పర అనుకూల జీవనంలో వ్యక్తం అవుతూ వుంటుంది. సమాజ సంఘటన కోసం, ప్రజా జీవన సౌలభ్యం కోసం వ్యక్తి తన బాధ్యతలు నిర్వహించటం కోసం, నియమాలు, నిబంధనలు, కట్టుబాట్లు, అనవాయితీలు అచారాలు, సంప్రదాయాలు సహజంగా ఏర్పడతాయి. ఆస్పందనకు బాహ్యరూపాలు ఇవన్నీ, చైతన్య వంతమై, సహజ సిద్ధమైన ఈ సముదాయాలను 'ప్రకృతులు' అని పిలిచేవారు.

ఇలా వికసించిన స్వధర్మాలను, వ్యక్తిగత ధర్మాలను క్రోడీకరించడం, వ్యాఖ్యానించడం, యుగధర్మాన్ని దర్శించడం – అన్నింటినీ సంహితులుగా, స్మృతులుగా, శాస్త్రాలుగా రూపొందించడం మహర్షులపని ఆ ధర్మాన్ని రక్షించడం రాజ్యవ్యవస్థ బాధ్యత.

## సాముదాయక జీవనంలో స్వయంనిర్ణయం

భారతీయ రాజ్యవ్యవస్థలో అనాదికాలంనుండి శాశ్వత పునాదిగా ఉన్న ఒకేఒక సూత్రం స్వయం నిర్ణయాధికారమున్న సాముదాయక

జీవనం. మూకుమ్మడిగా ఓటుద్వారా నిర్ణయించేసే రాజకీయాలలోనేకాక జీవితంలోని ప్రతివిషయంలోను ఈ స్వయం నిర్ణయం వ్యక్తమయ్యేది. (యోగి శ్రీ అరవిందులు-Foundations of Indian Culture)

ఈ స్వయం నిర్ణయసూత్రం గ్రామసభలో, పంచాయితీలో సమితి గణంలో, సంఘంలో, సౌరసభలలో, వృత్తిపరమైన శ్రేణులలో ప్రతి బింబించింది.

## అభిషేకమంత్రం

గ్రామ పంచాయితీలు స్వతంత్రమై, స్వయం భువులు అయిన వ్యవస్థలు. ఆ వ్యవస్థలకు ఆదేశాలు జారీచేసే అధికారం రాజుకు వుండేది కాదు. రాజుకు సలహా ఇచ్చే రాజసమితిలో పంచాయితీల ప్రతినిధులు సభ్యులుగా వుండేవారు. అలా గ్రామ పంచాయితీల మాట రాజు వినవలసి వచ్చేది. పంచాయితీల ప్రతినిధులు రాజుయొక్క పట్టాభిషేకంలో పాల్గొనే వారు.

అభిషేక మంత్రాలలో రాజు ఇలా ప్రతిజ్ఞ చేసేవాడు: "నేను ఎల్లప్పుడు దేశాన్ని దైవంగా భావించి రక్షిస్తాను. ధర్మనీతి ప్రకారం, దండనీతికి విరుద్ధం కాకుండ నేను ప్రవర్తిస్తాను. నా చిత్తం వచ్చినట్లు ప్రవర్తించను." ఇలా రాజు కేవలం ఒక కార్య నిర్వాహణాధికారిగా వ్యవ హరించాడు.

## గ్రామపంచాయితీ ఓచిన్న గణరాజ్యం

మరోప్రక్క గ్రామపంచాయితీ స్వేచ్ఛకు, అంగాంగీ భావనకు ప్రతిరూపమై వేదకాలంనుంచి మొన్న మొన్నటివరకు విలసిల్లింది. గ్రామా ల్లోని ప్రజలంతా మతపరంగా, సామాజికంగా, సైనికంగా, రాజకీయంగా ఒకే సముదాయంగా వ్యవహరించేవారు.

ప్రతి గ్రామసముదాయం ఒకచిన్న గణరాజ్యం ప్రతిగ్రామం తన పరిధిలో స్వయంప్రతిపత్తి, స్వయం నిర్ణయాధికారం కలిగినసముదాయం అది తాను ఎన్నుకున్న పంచాయితీ పాలనలో నడిచేది. విద్య, రక్షణ, న్యాయ వ్యవస్థలన్నీ తనకు తానుగా నిర్వహించుకునేది ఒక్క మాటలో చెప్పాలంటే గ్రామం ప్రేమసూత్రంతో పెనువేసుకున్న ఒక కుటుంబం.



ఈ చారిత్రక సత్యాన్ని, రాజ్యవ్యవస్థపై భారతీయ సిద్ధాంతాల సారాన్ని దర్శించిన గాంధీజీ గ్రామ స్వరాజ్య సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఆయన తన కల్పనను ఇలా వర్ణించారు; ఎన్నో గ్రామాలతో కూడిన ఆ వ్యవస్థలో ఒకటితర్వాత ఒకటిగా విస్తరించుకుంటూ పోయే వర్తులాలు ఉంటాయి. ఈ వర్తులాలు ఒకదానిపై ఒకటి ఉండవు ...జీవితం అఖండ మండలాకారంగా వుంటుంది ఈ అఖండ మండలానికి కేంద్ర బిందువు వ్యక్తి. అతడు గ్రామంకోసం, గ్రామం జనపదంకోసం; ఇలా ఆహుతి కావడానికి సిద్ధంగా వుండటంతో అంతాకలిసి ఒకే జీవితంగా రూపొందుతుంది అందులోని వ్యక్తులు అహంకారం ఏమాత్రం లేకుండ అణకువగా, ఆ అఖండ మండలంయొక్క గాంభీర్యాన్ని పంచుకుంటూ, అందులో అంతర్భాగులుగా ఉంటారు. కనుక బాహ్య పరిధి లోపలి వర్తులాన్ని అణచడానికి అధికారాన్ని వినియోగించదు తన పరిధిలో ఉన్న అన్నింటికీ బలం ఇస్తుంది, అన్నింటినుంచి బలం పొందుతుంది.



## పడుగుపేకలుగా క్షేత్రము - వృత్తి

నేడు గ్రామస్వరాజ్య సిద్ధాంతం సక్రమంగా అమలు జరగాలంటే (1) పంచాయితీలకు ఇతర స్థానిక సంస్థలకూ రాజ్యాంగపరమైన అధికారాలు, ఆర్థిక వనరులు కల్పించాలి. (2) క్రిందిస్థాయిలలో ఏకగ్రీవంగా

ఎన్నికలు జరగాలి (3) గ్రామస్థాయినుంచి, అఖిలభారత స్థాయివరకు వృత్తి కుటుంబాలు, పారిశ్రామిక కుటుంబాలు ఏర్పరచాలి. (4) క్షేత్ర కుటుంబాలు, వృత్తి కుటుంబాలు పడుగుపేకలుగా రాజ్యవ్యవస్థను పునర్నిర్మించాలి.

ఇలా మన రాజ్యవ్యవస్థలో విప్లవాత్మకమైన మార్పులు వచ్చిన నాడు గ్రామ పంచాయితీ భారతీయతకు కుదురుగా, రాజకీయ వికేంద్రీకరణకు తొలిమెట్టుగా మానవత్వపు విలువలకు ఆలంబనంగా, ఆత్మీయతా భావనకు అద్భుత ప్రతిరూపంగా విలసిల్లుతుంది. ఆర్థిక వికేంద్రీకరణ రాజకీయ వికేంద్రీకరణ సక్రమంగా సాగితే గ్రామ స్వరాజ్యం ప్రేమ సామ్రాజ్యంగా పరిణతి చెందుతుంది.



# 5

# మనిషి అదుపులో మర

*ఈ ప్రపంచం ప్రతి ఒక్కరి అవసరాలను తీర్చగలదు; కాని ప్రతి ఒక్కరి లోభాన్ని తీర్చజాలదు.*

గాంధీజీ

## టెక్నాలజీ విపరిణామాలు

ఆధునిక యుగం ప్రధానంగా టెక్నాలజీ యుగం. అయితే ఈ టెక్నాలజీ (సాంకేతికత) అనుసరిస్తున్న మార్గం ప్రపంచంలోని మేధావులకు ఆందోళన కలిగిస్తున్నది.

"మనం టెక్నాలజీ అనే భూతాన్ని పెంచాం. అది మరో భస్మాసురుడు కాకుండ మానవాళి క్షేమం కొసం దాన్ని ఎలా మచ్చిక చేసుకోవాలి అనేది ముఖ్యమైన ప్రశ్న! పాశ్చాత్యుల సాంకేతిక ప్రగతికి తట్టుకుని మానవాళి తన మనుగడ నిలుపుకోగలదా? మానవాళి ముందున్న కీలకసమస్య ఇదే" అంటాను, భారతీయ జీవనదృష్టితో వర్తమాన సమస్యలను విశ్లేషిస్తున్న మహా మేధావి దత్తోపంత్ ఠేంగ్డే. "రాజకీయ ఆర్థిక, సామాజిక, సైద్ధాంతికాది అన్నిరంగాలలో ఈ సాంకేతికతను ఎదుర్కొనాలి" అంటారు దీనదయాళ్ ఉపాధ్యాయ.

"మన దురదృష్టంకొద్దీ, పరిస్థితుల ప్రాబల్యం వలన పాశ్చాత్య పారిశ్రామిక వాదాన్ని మనం స్వీకరించాం. అది భయంకరమైన ఒక

అసురసృష్టి. ఈ పారిశ్రామిక వాదాన్ని అనుసరించటంద్వారా మన ఆర్థిక సంపదను పెంచుకోవచ్చు. కాని సంపదతో పాటు వచ్చే సామాజిక, నైతిక సమస్యల మూలంగా మనం ధనానికి బానిసలమై, మన సంస్కృతి లోని ఆధ్యాత్మిక సూత్రాన్ని కోల్పోయే పరిస్థితినుండి ఎలా తప్పించుకో వాలో నాకు అర్థం కావటంలేదు." అంటారు యోగి శ్రీ అరవిందులు.

సాంకేతికతకు గాంధీజీ వ్యతిరేకత సుస్పష్టమే.

మనిషి మనుగడకు కీలకసమస్యగా పరిణమించిన ఈ టెక్నాల జీని (1) సమాజంలో సంపదపాత్ర (2) పని పరమార్థం ఏమిటి? (3) పాశ్చాత్యటెక్నాలజీ తీరుతెన్నులు (4) ప్రజల టెక్నాలజీ, (5) బయోటెక్నాలజీ అనే ఐదు విభాగాలుగా తరువాతి అయిదు ప్రకరణా లలో పరిశీలిద్దాం.



# ౬

# సంపద ధర్మాచరణకే

## శవానికి సింగారమా ?

మనిషి కేవలం ఒక కోరికల పుట్ట కాదు భౌతిక శరీరాన్ని ధరించిన ఒక ఆధ్యాత్మిక చైతన్యం. ఆలయాన్ని అలంకరించటంలో లోపలి దేవతా విగ్రహాన్ని విస్మరిస్తే మన కృషిఅంతా బూడిదలో పోసిన పన్నీరే అవుతుంది. శవాన్ని సింగారించి ఏమిలాభం?

మనిషికి పైసాయే పరమాత్మ అయితే అతడు ఒక వింతపశువుగా మారిపోతాడు. ధనం ధర్మాచరణకు సాధనం కావాలి. కాని ధనమే లక్ష్యమైతే, అది విషయభోగాలకు సాధనంగా మారితే మనిషికి వస్తువుల మీద భోగవిలాసాలమీద వల్లమాలిన మమకారం జనిస్తుంది. అతనిలో పౌరుషం నశిస్తుంది. కోరికలదాహం ఎన్నటికీ తీరనిది కనుక అతనికి ఎప్పుడూ డబ్బుకొరతే. మరోప్రక్క పౌరుషం లోపించడంతో అతనిలో ధనసంపాదనకు సామర్థ్యం తగ్గుతుంది. కోరికలకు కళ్లెంవేయలేక వాటిని తీర్చే శక్తిలేక మనిషి ఆ రెంటిమధ్యా నలిగిపోతూ తనలోని దైవత్వ దీప్తికి దూరమయిపోతాడు. ఇదీ ఆధునిక మానవుణ్ణి పట్టి పీడిస్తున్న రోగం. దారిద్ర్యాన్ని నిర్మూలించాలని బయలుదేరిన ఆధునిక మానవుడు ఆ పని చేయలేకపోగా, భౌతిక వాద దృష్టి కారణంగా ఆధ్యాత్మికమైన వెలితినీ, దారిద్ర్యాన్నీ కొనితెచ్చుకుంటున్నాడు. ఏలియనేషన్ (పరాయితనం) అనే సామాజిక రుగ్మతకు లోనవుతున్నాడు.

## ఆత్మీయత మన సంస్కృతికి ఊపిరి

ఆర్థిక వ్యవస్థ తన సఫలతకు అవసరమయ్యే సంకల్పబలాన్ని, ఉత్సాహాన్ని, సామర్థ్యాన్ని తనకు తానుగా సృష్టించుకోలేదు. ఒకజాతికి ఉండే రాజకీయ ఆశయాలూ, సామాజిక గౌరవం కోసం వ్యక్తి చూపే అభిలాష తన కుటుంబంతో వ్యక్తికి ఉండే ప్రేమానుబంధం మొదలైన ఎన్నో ప్రేరణలు ఆర్థిక వ్యవస్థను నిర్మించడంలో, నిలిపి ఉంచడంలో దోహదం చేస్తాయి.

అలా ఒకజాతి సంస్కృతి, దాని విలువలు ఆ జాతి ఆర్థిక వ్యవస్థకు వరవడి దిద్దుతాయి. మనిషికీ మనిషికి మధ్య వ్యవహారాలకు ఊపిరి 'ఆత్మీయత' అని మన సంస్కృతి నమ్ముతున్నది. కేంద్రిత వ్యవస్థలలో ఈ ఆత్మీయత కరువవుతుంది. మనిషిని మనిషిగా కాక ప్రత్యేక వ్యక్తిగా పరిగణిస్తారు. నిజానికి మనిషిని పోలిన మనిషి ఉండడు. అనంతమయిన ఈ వైవిధ్యానికి కేంద్రిత వ్యవస్థలో స్థానమేలేదు. అతని ఎదుగుదలకు తోడ్పడటానికి బదులు అతనిని కేవలం ఒక యంత్రంలోని చీల(మేకు)గా మార్చివేస్తాయి. అతని స్వంత వ్యక్తిత్వం నశిస్తుంది. కనుక వికేంద్రీకరణ మన సంస్కృతికి అనుగుణం. అటువంటి వ్యవస్థలో మనిషి, ఫైళ్లలోని నెంబర్లతో కాక, చీమూ నెత్తురూ ఉన్న మనుషులతో వ్యవహరిస్తాడు. ఇందులో మానవ సంబంధ బాంధవ్యాలకు, వ్యక్తి వికాసానికి, సంస్కరణకు అవకాశం హెచ్చు.

## కుటుంబ జీవనంలోనుండి పరిశ్రమ

మన సంస్కృతికి కేంద్ర బిందువైన ఆత్మీయతకు కుదురు గృహస్థాశ్రమం. ఆదర్శప్రాయమైన కుటుంబ జీవనం మన సామాజిక ఆర్థిక వ్యవస్థకు స్వయం నిర్ణయాధికారమున్న తొలి వర్తులం. సమన్వయ పూర్వకమైన ఈ స్వయం నిర్ణయసూత్రాన్ని ప్రతి కుటుంబాలకూ,

గ్రామ కుటుంబాలకూ జాతి, విశ్వం అనే పరిధులకూ విస్తరించుకుంటూ పోవాలి. కుటుంబం అనేది కేవలం ఒక శరీరం కాదు. దానికి ఒక మనస్సు, ఆత్మ ఉన్నాయి. విత్తునుంచి మొక్క, కాండం, ఆకులు, పువ్వులు, పండ్లు వచ్చినట్లు, కుటుంబ జీవనం నుంచి, పారిశ్రామిక జీవనం పుట్టుక రావాలి. ఇలా జరిగినప్పుడే కుటుంబజీవనంలోని విధేయత, సత్యసంధత, పనిని ఆరాధనగా పరిగణించే లక్షణం, భక్తి శ్రద్ధలు, విగ్రహం, కర్తవ్యదృష్టి ఆదర్శవాదం వంటి సత్సంస్కారాలు, పారిశ్రామిక జీవనంలోకి, జాతీయ జీవనంలోకి సహజంగా ప్రవర్తిస్తాయి.

అలాగే మనిషి ప్రకృతిని తల్లిగా పూజించటం మన సంస్కృతిలో అంతర్భాగం. గోమాతనుంచి పాలు పితికేవిధంగా ప్రకృతిసంపదను వెలికితీసి వినియోగించటం విజ్ఞత. ప్రకృతిలోని సమతూకం (Balance) దెబ్బతినని విధంగా భావితరాల అవసరాలను గుర్తిస్తూ, మనిషి ఆయా వనరులను వాడుకోవాలి

## అసూయకు లోభానికి అందలం

కామ క్రోధ లోభ మోహమద మాత్సర్యాలు అరిషడ్వర్గమని, అవి మనిషికి ఆరు శత్రువులని మన సంస్కృతి బోధిస్తున్నది. లోభం, మాత్సర్యం ఆధారంగా ఆధునిక పారిశ్రామిక నాగరికత చెలరేగుతున్నది. లోభగుణం, అసూయ అదుపు తప్పితే మనిషిలో మేధస్సు, వివేకం మంట కలుస్తాయి. ఆనందం,మనశ్శాంతి అడుగంటిపోతాయి. లోభగుణం వల్ల కోరికలు పెరిగేకొలదీ మనిషికి తన అదుపులో లేని బయటిశక్తుల మీద ఆధారపడే అవసరం పెరుగుతుంది. ఆ కారణంవల్ల 'బ్రతుకు భయం' పెరుగుతుంది. యుద్ధాలకు దారితేసే ఉద్రిక్తతలు పెరుగుతాయి.

# వ్యక్తిత్వం కోల్పోయిన ఆర్థికజీవి

శాస్త్రీయహేతువాదం, సాంకేతిక నైపుణ్యం మన సమస్యల నన్నింటినీ పరిష్కరిస్తాయి కనుక నీతి, నియమాలు దేనికి-అనే ధోరణి ఆధునిక నాగరికతలో అందలం ఎక్కింది. గాంధీజీ, మంచీ చెడుల విచక్షణ అవసరంలేని వ్యవస్థలగురించి కలలు కనటం వెర్రితనమని బోధించాడు. ఈ వెర్రితనం కారణంగా పాశ్చాత్య దేశాలలో లోభగుణం, లాభదృష్టి రాజ్యమేలుతున్నాయి మనిషి ఆర్థికజీవిగా మారిపోయాడు. కమ్యూనిస్టు దేశాలలో ఈర్ష్యాద్వేషాలదే అధికారం. దానితో మనిషి వ్యక్తిత్వాన్ని కోల్పోతున్నాడు.

కనుక మనిషిలోని మానవత్వాన్ని మంటకలిపే ఆ మార్గం వదలి, ప్రకృతి, శాస్త్ర విజ్ఞానం, నీతి, ఆర్థికశాస్త్రం అన్నింటినీ సమన్వయించు కుంటూ సాగిపోవటం శ్రేయస్కరం.



# 7

# నలుగురి మంచి కోసం పని

సమన్వయాన్ని సాధించాలంటే ముందు మనిషికీ, పనికీ ఉన్న సంబంధం తెలుసుకోవాలి. ఎందుకంటే ఆర్థిక రంగానికి ప్రాతిపదిక-మనిషి చేసే పని. పని పట్ల మనిషి అవలంబించే దృష్టి ఈ సమన్వయానికి కీలకం.

## లోక సంగ్రహం కోసం పని

"పనిచేయటం కర్తవ్యంగా బోధించేది ధర్మం. శ్రమయొక్క గౌరవం, దాని ద్వారా వచ్చే డబ్బువల్లకాక అది ధర్మబద్ధం కావడంవల్ల చేకూరుతుంది. అలాగే వేతనం ఆ శ్రమకు ప్రతిఫలం కాదు. శ్రమించే వ్యక్తి యొక్క యోగ క్షేమాల కోసం జరిగే ఏర్పాటు మాత్రమే. లోక సంగ్రహం కోసం పరమేశ్వర భక్తి రూపంలో కర్మ చేయాలని భగవద్గీత చెబుతున్నది. కనుక పనికి మూల ప్రేరణ లాభ దృష్టికాని, అంతులేని పోటీ కాని కాకూడదు. అంతులేని పోటీ మాత్స్యన్యాయానికి దారి తీస్తుంది" అంటారు దీనదయాళ్ ఉపాధ్యాయ.

గాంధీజీ దృష్టిలో పని నాలుగు విధాలు:— (1) ప్రతి వ్యక్తీ విధిగా చేయవలసిన కనీసమైన కాయకష్టం (2) జీవనోపాధి కోసం చేసే పని. (3) తనలోని శక్తి యుక్తులను గుణ గణాలను వెలికి తీసి తన వ్యక్తిత్వాన్ని తీర్చి దిద్దే పని. (4) ఇతరుల సేవకు చేసే పని.

పని ప్రయోజనాన్ని మరో విధంగా కూడా అంచనా వేయవచ్చు. (1) తన శక్తి యుక్తుల వినియోగానికి, వికాసానికి మనిషి అవకాశం ఇవ్వడం (2) కలిసి పని చేయటం ద్వారా తనలోని స్వార్థ చింతనను అధిగమించడానికి మనిషికి వీలు కల్పించటం. (3) నలుగురూ గౌరవంగా జీవించటానికి కావలసిన వస్తువులను సేవలను అమర్చుకోవటం.

## కళలేని పరిశ్రమ పాశవికం

మానవ జీవనంలోని మరో ముఖ్య విషయం. పనిలో ఆనందం లేకపోతే జీవితంలో ఆనందం వుండదు. అర్థం పర్థం లేని పని గానుగెద్దు పని. మనిషికి అది ఒక శాపం.

"కళ లేని పరిశ్రమ పాశవికమైనది. ఎందుకంటే అది కార్మికుని ఆత్మనూ, చైతన్యాన్ని క్రుంగ దీస్తుంది. కళాకారుడు ఒక ప్రత్యేక వ్యక్తి కాదు. ప్రతి వ్యక్తీ ఒక ప్రత్యేక కళాకారుడే" అంటారు ఆనంద కుమార స్వామి. మంచి పనికి మూల సూత్రం ఇదే

"పని లేకపోతే జీవితం క్షుద్రంగా తయారౌతుంది. పనిలో జీవం చైతన్యం, ఆత్మ లేకపోతే జీవితం కుంచించుకుపోయి, నశించిపోతుంది" అంటారు పాశ్చాత్య మేధావి ఆల్బర్ట్ కేమస్.

## మనిషి లోపల మరో వనరు

పారిశ్రామికీకరణకు అన్నింటికీ మించిన వనరు - మనిషి లోని చొరవ, కల్పనా శక్తి, మేధాశక్తి కానీ ఆధునిక ఆర్థిక శాస్త్రం ఖనిజాలు ఇంధనం నీరు వంటి వనరులకు ఇచ్చే ప్రాధాన్యం, మనిషి లోపల ఉన్న వనరుకు ఇవ్వడం లేదు. కార్మికుడు చేసే పని అతన్ని ఎలా ప్రభా

వితం చేస్తోందో ఎవ్వరూ పట్టించుకోవటం లేదు అవసరాలకు అనుగుణంగా, ముఖ్యంగా యంత్రానికి అనుగుణంగా మనిషి మారకూడదు.

## లోపలి విలువలకు రూపం- పని

ప్రఖ్యాత గాంధేయ ఆర్థిక శాస్త్ర వేత్త జె. సి. కుమారప్ప ఇలా అంటారు. "శరీరానికీ, ఆహారానికీ ఉన్న సంబంధమే మనిషిలోని ఉదాత్త శక్తులకూ, పనికీ ఉన్నది. పని మనిషిలోని ఉదాత్త ప్రకృతిని పోషించి చైతన్య వంతం చేస్తుంది. తన సామర్థ్యాన్ని అంతటినీ వినియోగించి అత్యుత్తమమైన వస్తువును తయారు చేయాలనే ప్రేరణ ఇస్తుంది. మనిషి యొక్క సంకల్పశక్తిని సరైన మార్గంలో నడిపిస్తుంది. మనిషిలోని పశుత్వాన్ని అదుపు చేస్తుంది. మనిషి తన విలువలనువ్యక్తం చేయటానికీ తన వ్యక్తిత్వాన్ని వికసింప జేసుకోవటానికీ అది చక్కని వరవడి దిద్దుతుంది.

## మనిషి ముందా ? వస్తువు ముందా ?

అర్థరహితమైన, విసుగుదల జనింపజేసి, వ్యక్తిత్వాన్ని కుంచింపజేసి, నరాలను పిప్పి చేసే పని- మానవత్వానికి మహాపచారం చేస్తుంది. మనిషికన్నా వస్తువుకు ప్రాధాన్యం ఇవ్వడంతో దయాదాక్షిణ్యాలకు నీళ్లు వదలుకొని, ఆత్మ సౌందర్యాన్ని చంపుకోవటం అవుతుంది.

## పని- మనస్సు- ముద్ర- శీలం

అలాగే పనికి ప్రత్యామ్నాయంగా విశ్రాంతి కోసం వెదకడం వృథా. పనీ, విశ్రాంతీ ఒకే సజీవ ప్రక్రియలోని పరస్పర పూరకమైన అంగాలు. వాటిని వేరు చేస్తే పనిలో వున్న ఆనందం, విశ్రాంతిలో వున్న హాయి- రెండూ హరించుకు పోతాయి. అసలు నాకరికతలోని ప్రధానాంశ

మేమిటి? కోర్కెలను క్షణానికొకటిగా పెంచుకుంటూ పోవటం కాదు. శీలాన్ని మరింత స్వేచ్ఛగా తీర్చి దిద్దుకోవటం ముఖ్యం. మనం చేసేపని మన మనస్సుపై వేసే ముద్రల మేళవింపే శీలం. గౌరవం, స్వేచ్ఛ పెంపొందే వాతావరణంలో పని చేసినప్పుడు వ్యక్తికీ వస్తువుకూ సార్థక్యం లభిస్తుంది.

కాని ఆధునిక అర్థిక శాస్త్రం మనిషికన్నా వస్తువుకు, సృజనాత్మకమైన కార్యకలాపంకన్న వినియోగానికి హెచ్చు ప్రాధాన్యం ఇస్తున్నవి. అంటే కార్మికునికన్న అతడు తయారు చేసిన వస్తువుకు హెచ్చు విలువ అవుతోంది చేతనానికన్న జడానికి విలువ పెరుగుతోం దన్న మాట. ఇలా విలువలు తారుమారయితే మనిషిలోని పశువుకు ప్రోత్సాహం లభిస్తుంది మనిషి గమ్యం మోక్షమే గదా! మంచి పని ఆ మోక్షానికి ఒక మార్గం. కాని యంత్రాలు మంచి పనికి గొడ్డలి పెట్టు వంటివి.



# 8

# మహాయంత్రపు రొదలో మానవత్వపు మొర

## కాలం చెల్లిన కర్మకాండ కథ

పాశ్చాత్య దేశాలలో ఆవిరి యంత్ర యుగంలో పెద్ద పెద్ద యంత్రాలు కార్ఖానాలు స్థాపించారు. వృత్తికళలవారు, స్వయంవృత్తుల వారు కార్మికులుగా మారిపోయారు. ఆ తరువాత విద్యుచ్ఛక్తిని కను గొన్నారు. దానితో భారీ పరిశ్రమలు స్థాపించవలసిన అవసరం తగ్గి పోయింది. ఐనావారు తమపారిశ్రామికవిధానాన్ని మార్చుకోలేకపోయారు.

అలాగే చమురు చౌకగా దొరికే రోజులలో రవాణా సౌకర్యం బాగా పెరిగి, ఎంతదూరం నుంచైనా ముడి సరుకును దిగుమతి చేసుకోవ టానికి, తయారైన వస్తువులను ఎగుమతి చేయటానికి అవకాశం ఉండడం వల్ల మహా నగరాలు ఏర్పడ్డాయి. నేడు ప్రపంచంలో చమురు నిల్వలు వేగంగా తరిగిపోతూ ఉండటంతో మహానగరాల ప్రయోజనం తగ్గింది. అయినా నగరాలపట్ల వ్యామోహం పెరుగుతూనే ఉంది.

## యంత్రాన్ని మచ్చిక చేద్దాం

ఈ మహా నగరాలనిండా రోగిష్ఠినాగరికత, ఇరుకు బ్రతుకులు, కృత్రిమ వాతావరణం, తమకు తామే దూరమై భయం భయంగా బ్రతికే

"ఏకాకి గుంపులు" కనపడతాయి. నిజానికి మహానగరాలన్నీ జనారణ్యాలు.

ఈ పారిశ్రామిక నాగరికత మనిషిని తన జన్మస్థలం నుంచి పెళ్లగించివేస్తుంది. వత్తిడ్ప్ప, కలతలు, వేళకు తిండి నిద్రలేకపోవటం ఇవన్నీ మనిషి ఆరోగ్యాన్ని క్రుంగతీస్తున్నాయి. పాడిందే పాడరా అన్నట్లు ఉండే పని, వ్యక్తిత్వలోపం, కుటుంబ జీవితం ఛిన్నాభిన్నం కావటం, అర్థంలేని ఉత్తర్వుల అదకత్తెరలో యాంత్రికమైన దినచర్య ఇవన్నీ మనిషి మనసును కలుషితం చేస్తున్నాయి.

ఉత్పత్తి ప్రక్రియ సామాజిక వ్యవస్థకు కీలకంగా తయారయింది. మనిషిని ఒక ఉత్పత్తి సాధనంగాచేసి కట్టిపడేస్తున్నారు. మనిషికి నిజమైన స్నేహితుడు కరువవుతున్నాడు. హోటల్ సంస్కృతి, గమ్యం లేని నాగరికత మానవతను ఉక్కిరి బిక్కిరిచేస్తున్నాయి.

కనుకనే 'లేబర్ పాలసీ' అనే గ్రంథంలో దత్తోపంత్ఠేంగ్డీ ఇలా వ్రాసారు. "పారిశ్రామిక నాగరికత అనే పెనుభూతం మన ఆలోచనలను ఆవహించ నివ్వకూడదు. యంత్రం మన మాతృదేవిని గద్దెదించి ఆ స్థానాన్ని ఆక్రమించకూడదు మాతృదేవిని కొలిచే చేతులు యంత్రాన్ని కొలవకూడదు యంత్రం యొక్క రాకాసిచక్రం చేసె రొదలో మానవత్వంచేసే ఆక్రందన, ఆర్తనాదం మునిగిపోకూడదు... పిల్లులనూ, కుక్కలనూ మచ్చికచేసి, పెంపుడు జంతువులుగా చేసుకున్నట్లే మనం యంత్రాలను అదుపుచేయాలి."

## మరో బకాసురుడు

అదుపు చేయకపోతే ఏమవుతుందో సూపర్ టెక్నాలజీలో మునిగి తేలుతున్న అమెరికాలో చూడవచ్చు. ప్రపంచంలోని ప్రాథమిక నరులలో 40 శాతాన్ని ప్రపంచప్రజలలోని ఆరుశాతానికి అందించే ఆ

ఆర్థిక వ్యవస్థ నిర్వహణ సామర్థ్యం ఏపాటిది? పోనీ ఇన్ని వనరులు దిగ మ్రింగుతున్న ఆ అమెరికాలో ఆనందం, సంస్కృతి, శాంతి సామరస్యాలు వెల్లివిరుస్తున్నాయా? అదీ కనపడదు. పై పెచ్చు పిచ్చాసుపత్రులు ఆత్మ హత్యలు, విడాకులు, మాదక ద్రవ్యాల వాడకం అక్కడే హెచ్చు. ఆ టెక్నాలజీ స్వరూపమే అలాంటిది. అది ప్రకృతిని కొల్లగొడుతోంది కలుషితం చేస్తోంది. మనిషిలోని మానవత్వాన్ని మలిన పరుస్తోంది.

## ప్రకృతిమాత తిరస్కారణ

ప్రకృతిలో సమతూకం, తనను తాను శుభ్రపరచుకునే లక్షణం ఉన్నాయి. పరిమాణంలో, వేగంలో, హింసలో ఒక పరిమితి వుంది. సూపర్ టెక్నాలజీకివేమీ లేవు. కనుక అది ప్రకృతి శరీరంలో ఒక పరాయి వస్తువుగా తయారయింది. ప్రకృతి ఆ పరాయి వస్తువును తిరస్కరిస్తున్న సూచనలు కోకొల్లలుగా కానవస్తున్నాయి

మొదటి దశలో గాలి, నీరు, ఆహారం కలుషితం అవుతున్నాయి. ఇంధన సంక్షోభం ప్రారంభ మవుతోంది. రెండవ దశలో మనిషిలోని సున్నితత్వం, ఆహ్లాదకర పరిసరాల మధ్య జీవించాలనే ఆకాంక్ష అంతరిస్తున్నాయి. మూడవ దశలో మనిషికీ, ప్రకృతికీ, ఆర్థిక రంగానికి మధ్య వుండే సమన్వయ సూత్రం తెగిపోతున్నది.

## పలాయన వాదమా? దురాక్రమణ వాదమా?

సృజనాత్మకంగా, ప్రయోజనపరంగా, మనస్ఫూర్తిగా పని చేయడంలో ఉన్న ఆనందం ఇంతా అంతా కాదు. ఆధునిక టెక్నాలజీని అనుసరించడం వలన పనిలో అర్థం వుండదు. ఆనందం వుండదు. వట్టి విసుగుదల మాత్రమే వుంటుంది. అప్పుడు పలాయన వాదం, దురాక్ర

మణ వాదం ప్రారంభమవుతాయి. పలాయన వాదం విచ్ఛిన్నవిడితనానికి దురాక్రమణ వాదం ప్రపంచ యుద్ధాలకూ దారి తీసిన విషయం మనకు తెలిసిందే.

## అంతులేని వేగంతో మార్పు

సూపర్ టెక్నాలజీ మానవత్వపు విలువలను మరో విధ గా కూడ మంటి కలుపుతున్నది. సమాజ జీవనంలో ఆనందం కొన్ని భావాత్మక వ్యవస్థల (Phychological Structures) మీద ఆధారపడివుంటుంది. ఆ వ్యవస్థలు కుప్పకూలిపోతే ఏకాత్మ భావన, సహకారం, పరస్పర గౌరవం, ఆత్మగౌరవం, ఆపదల్లో ధైర్యం- అన్నీ నీరుగారి పోతాయి. అలాంటివ్యవస్థలలో కుటుంబవ్యవస్థ ప్రధానమైనది. తండ్రి తనకొడుకుకు నేర్పడానికి ఏదీ మిగలని విధంగా మార్పులు జరిగితే కుటుంబ జీవనం ముక్క- చెక్కలయ్యే ముప్పు ఉంది. సూపర్ టెక్నాలజీ శర వేగంతో అలాంటి మార్పులు తెస్తోంది. కనుకనే పారిశ్రామిక దేశాలలో హిప్పీలుగా మారే ధోరణి, నేరం పరాయితనం, ఉద్రిక్తతలు, సామాజిక విచ్ఛిత్తి విలయ తాండవం చేస్తున్నాయి.

మరో పెద్ద చిక్కు- ఏమంటే, సంస్థ పెద్దదయినకొద్దీ పొరుగు వాడికి సాయపడటానికి; నైతిక విలువల ఆధారంగా పనిచేయటానికి అవ కాశాలు తరిగిపోతాయి. అందరికీ ఒకే నియమం. దయాదాక్షిణ్యాలకు తావే వుండదు. ఆప్యాయంగా, వాత్సల్యంగా, ఆర్ద్రంగా మెలిగే అవ కాశం తగ్గుతుంది. చిన్నచిన్న సంస్థలలోని వారు వ్యక్తులను ముఖా ముఖీగా కలుసుకుని నిర్ణయాలు తీసుకోగలుగుతారు. మనిషి గుండెకు కావలసింది నిర్జీవమైన నియమనిబంధనలు కావు; ఆత్మీయత, అభిమానం అనుబంధం కావాలి.

సహజమైన ప్రక్రియ తలక్రిందులు కావటం సూపర్ టెక్నాలజీ లోని మరో వైపరీత్యం. శ్రమ, ఇంధనశక్తి, పెట్టుబడి, నిర్వహణ, వస్తువు గిరాకీ-ఇవన్నీ దృష్టిలో ఉంచుకుని ఎలాంటి యంత్రం వాడాలో నిర్ణయించడం సహజ ప్రక్రియ. కానీ సూపర్ టెక్నాలజీలో యంత్రాన్ని కేంద్రంగాచేసి తదనుగుణంగా మిగతావాటిని మార్చే ప్రయత్నం జరుగుతుంది యంత్రంకోసం మనిషి మారవలసి వస్తుంది.

## మనిషికీ మనిషికీ దూరం

"భారీపరిశ్రమలలో క్రమంగా వ్యక్తుల మధ్య సంబంధాలు దూరమవుతాయి. మనిషి ఒక యంత్రంలో హృదయంలేని సమష్టిలో ఒక చీల (మేకు) గా తయారవుతాడు...అలాంటి యంత్రాలతో పనిచేస్తే వ్యక్తిత్వాన్ని వ్యక్తం చేయలేము. కనుక, కుటుంబం ఆధారంగా, పనిని జీవితంలో అంతర్భాగంగా చేయగలిగే పారిశ్రామిక వ్యవస్థ మనకు అనుకూలమైనది. యజమాని—కార్మికుడు, ఉత్పత్తిదారుడు-వినియోగదారుడు; వీరి మధ్య సంబంధాలను అప్పుడు మనం సరిగా నిర్ణయించగలం. పాశ్చాత్యులు ఈ సంబంధాలలో వైషమ్యాలను సృష్టించారు" అంటారు దీనదయాళ్ ఉపాధ్యాయ.

సూపర్ టెక్నాలజీలో మానవ సంబంధాలలో వైషమ్యాలు సృష్టించబడడానికి కారణం ఉంది. అది మనిషిని రక్తమాంసాలు, సత్వరజస్తమోగుణాలు, ఇష్టాయిష్టాలు ఉన్న మనిషిగా కాక ఒక ఆర్థిక జీవిగా, ఒక మనిషిగా పరిగణిస్తుంది.

## యంత్రం దోపిడీకి ఆయుధం

ఈ దుష్పరిణామాలన్నీ ఊహించే గాంధీజీ సాంకేతికతకు కొన్ని అభ్యంతరాలు చెప్పారు. 1) యంత్రాలతోపాటు పాశ్చాత్య నాగరికత దిగుమతి అవుతోంది. 2) భౌతికవాదం, అంతులేనికోర్కెల పెరుగుదల

యంత్రాలతో పాటు దిగుమతి అవుతున్నాయి. 3) గ్రామాలకూ పట్టణాలకూ మధ్య అగాధం పెరుగుతోంది. 4) యంత్రం దోపిడీకి ఒక ఆయుధం 5) పెట్టుబడిదారీ విధానంలోని లోపాలను యంత్రాలు దోహదం చేస్తున్నాయి. 6) సామాజిక అసమానతలు పెరుగుతున్నాయి.

## పెరిగిపోతున్న అసమానతలు

సూపర్ టెక్నాలజీ తెచ్చిపెట్టే అనర్థాలు మరికొన్ని. 1) అది మన సమాజంలో ఇమడలేదు. 2) భారీ పరిశ్రమలు చిన్న పరిశ్రమల స్థానాన్ని ఆక్రమిస్తాయి. 3) ప్రతి వ్యక్తికీ పని ఉండదు. 4) పెట్టుబడి ప్రధానం కాబట్టి మన శక్తికి మించినది. 5) దిగుమతులపై ఎక్కువగా ఆధారపడాలి. మన నిర్వహణా సామర్థ్యం, శిక్షణ విలువ లేకుండా పోతాయి. 7) కార్మికుడు కుటుంబం నుంచీ, గ్రామీణ సమాజం నుంచీ దూరమైనందున కృత్రిమ వాతావరణంతో అనేక వికృతులకు గురి అవుతున్నాడు. 8) మన సాధనాలపై వత్తిడి పెరిగి కొరతలు, చిక్కులు పెరుగుతాయి. 9) సత్వర ఫలితాలు ఉండవు 10) భారీ పరిశ్రమలకు వ్యవసాయానికి మధ్య సాన్నిహిత్యం ఏర్పడదు. అంతేకాదు; దళారీలు అనేకమంది తయారవుతారు. 11) పెట్టుబడి, కార్మికశక్తి కలసి వినియోగదారుడిని దోపిడీచేసే ప్రమాదం ఉంది. 12) కార్మికులను గ్రామాలనుంచి పట్టణాలకు తరలించడం మూలంగా గ్రామాలలో చొరవ, సామర్థ్యం ఉన్నవారు కరువై వ్యవసాయం దెబ్బతినవచ్చు. 13) నూటయాభై ఏండ్లు వలస దేశాలను దోపిడీ చేసి పాశ్చాత్య దేశాలు భారీ పరిశ్రమలను ఏర్పరచుకున్నాయి. మనకు వలస దేశాల దోపిడీపట్ల నమ్మకం లేదు. 14) భారీపరిశ్రమల వలన వివిధ ప్రాంతాల మధ్య అసమానతలు పెరుగుతాయి. 15) దేశ రక్షణదృష్ట్యా

పరిశ్రమలు ఒకేచోట కేంద్రీకరింపబడటం మంచిది కాదు. 18) రవాణా సాధనాలపై వత్తిడి పెరుగుతుంది. (భారతీయ అర్థ వ్యవస్థ - దీనదయాళ్ ఉపాధ్యాయ)

## టెక్నాలజీ పేరుతో సామ్రాజ్యవాదం

ఇన్ని అనర్థాలకు కారణమయిన సూపర్ టెక్నాలజీనే వర్ధమాన దేశాలు దిగుమతి చేసుకుంటూ, అదే పారిశ్రామిక ప్రగతిగా పరిగణించడం ఒక దురదృష్టకరమైన పరిణామం. సూపర్ టెక్నాలజీని దిగుమతి చేసుకోవడంవల్ల ఆయా దేశాలు ఎదుర్కొంటున్న సంక్షోభాలు అనేకం. 1) సూపర్ టెక్నాలజీకి దేశీయం, స్థానికం అయిన సామగ్రి పనికిరాదు. 2) దాని డిజైన్లు క్లిష్టంగా ఉంటాయి. కనుక, నిర్వహణ చాల కష్టం. 3) భారీ మార్కెట్టు కోసం రూపొందించిన టెక్నాలజీ అది 4) పేద దేశాల మీద కృత్రిమమైన ఖర్చులు, ధరల వ్యవస్థ రుద్దబడుతోంది. 5) ధనిక వర్గాలకు ఉపకరించే ఖరీదయిన వస్తువులు పేదదేశాలమీద క్రుమ్మరింపబడతాయి. ఇందువలన సామాన్య ప్రజలకు, పాలించే వర్గాలకు మధ్య అగాధం పెరుగుతోంది అంతేకాదు; వనరులు ధనిక వర్గాలకు ఉపకరించే వస్తువుల తయారీకి మళ్ళింపబడ్తాయి పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన దేశాలు టెక్నాలజీ బదలాయింపు పేరుతో పేద దేశాలను దోపిడీ చేస్తున్నాయి టెక్నాలజీవల్ల పుట్టుకువచ్చే క్రొత్త వర్గం, వనరులను కబళించి, అభివృద్ధిని ఆటంకపరుస్తున్నది క్రమంగా టెక్నాలజీ పేరున సామ్రాజ్యవాదం విస్తరిస్తోంది. టెక్నాలజీ దిగుమతి పెరుగుతున్నకొలదీ అభివృద్ధి వేగం తగ్గిపోతున్నది. దారిద్ర్యరేఖకు దిగువన ఉండే జనం పెరుగుతున్నారు. ఇందుకుతోడు టెక్నాలజీ, దాని పర్యవసానం అయిన కన్స్యూమరిజం (వినియోగదారుల వాదం) చేతులు కలిపి మనిషిని యంత్రాలకు: యాంత్రికమైన అలవాట్లకు బానిసగా చేస్తున్నాయి. (జే. డి. సేఠి; గాంధీ టుడే)

# విలువల తారుమారు

ఇలా సూపర్ టెక్నాలజీ ద్వారా లోభం, దురాశ, అధికార దాహం, మనిషిని యంత్రానికి బానిసగా మార్చివేస్తున్నాయి. ఆత్మను హింసించే, పని అర్థంలేని పని, యాంత్రికమైన పని, మనిషిని మైనపు బొమ్మగా మార్చివేస్తోంది. యంత్రాలు మనుషులుగా, మనుషులు యంత్రాలుగా మారిపోతున్నారు. మనిషి మనసుకు, ఆ మనసులోని మార్దవానికి విలువే లేకుండా పోతున్నది.



# 9

# పెంపుడు జంతువుగా యంత్రము

అయితే మనం ఎటువంటి టెక్నాలజీని రూపు దిద్దుకోవాలి? ఈ ప్రశ్నకు సమాధానం చెప్పబోయేముందు మరో ప్రశ్న వేసుకోవాలి. అసలు ప్రజాస్వామ్యం, మానవ వ్యక్తిత్వపు గౌరవం, జీవన ప్రమాణం, జీవన సాఫల్యం, ఆత్మసాక్షాత్కారం—ఇవన్నీ వస్తువుల కోసమా? మనుషుల కోసమా? మనుషుల కోసమేనని సమాధానం చెప్పకొక తప్పదు. అయితే పరస్పర అవగాహనకు అనుకూలత ఉన్న చిన్న చిన్న సముదాయాలలో మాత్రమే మనిషి మనిషిగా ఉండగలడు. ఒక చిన్న పరిధిలో మాత్రమే మనిషి తన వ్యక్తిత్వాన్ని నిలుపుకోగలుగుతున్నాడు. సమష్టితో సమన్వయం సాధించగలుగుతున్నాడు. సిద్ధాంతాలను, నీతి సూత్రాలను మానవాళి అంతకూ వర్తింప జేయవచ్చు. కాని కార్యాచరణకు వచ్చేసరికి చిన్నయూనిట్లు అవసరమవుతాయి. ఏ పనైనా చిన్న చిన్న బృందాలుగా ఏర్పడి పనిచేస్తే మంచి ఫలితాలు వస్తాయని, ప్రపంచంలోని వివిధదేశాల, సంస్థల అనుభవం చెబుతున్నదని ప్రముఖ తత్వవేత్త ఆల్డస్ హక్స్లీ 'ఎండ్స్ అండ్ మీన్స్' అనే గ్రంథంలో 'వికేంద్రీకరణ' అనే అధ్యాయంలో వివరించారు.

## అభిరుచికి అనుగుణంగా పని

మనిషి మనిషిగా జీవించాలంటే అతడు చేపట్టే వృత్తికి నాలుగు ముఖ్యలక్షణాలు ఉండాలి. (1) మనిషి తన వృత్తిని ప్రేమించాలి.

అంమకై మనిషి అభిరుచికి, సహజ గుణానికి తగినపని అతనికి ఇవ్వాలి. (2) అతడు నిజాయితీగా పనిచేస్తే సిరిసంపదలు పొందగలగాలి (3) మనిషి తాను చేసే పనిద్వారా ఎదగగలగాలి (4) ఒక కార్మికుని ప్రయోజనాలకు, మిగిలిన కార్మికుల శ్రేయస్సుకు వైరుధ్యం ఉండ కూడదు. (దత్తోపంత్ ఠేంగ్డే–లేబర్ పాలసీ)

## కార్మికుని నాణ్యత పెంచే పద్ధతి

మనిషి పని ద్వారా ఎలా ఎదగగలడు? మనం రూపొందించే టెక్నాలజీ-పరికరాల నాణ్యత కన్నా హెచ్చుగా శ్రమ నాణ్యాన్ని పెంచేదిగా ఉండాలి. కార్మికులు సాంకేతిక శాస్త్రంలోనే కాక మానవ సంబంధాలలో కూడ పరిజ్ఞానం సంపాదించాలి. విద్యద్వారా, కార్మికుని అవగాహనను, మానసిక పరిధిని పెంచాలి. టెక్నాలజీ అతనికి అర్థ మయ్యేటట్లు చేయాలి. టెక్నాలజీ పరిసరాలను పరిరక్షిస్తూ ఉత్పాదక శక్తిని పెంచాలి. మనసులను మరింత సన్నిహితం చేయాలి.

## కోర్కెలు పెంచే ఉత్పత్తిపై అదుపు

ఈ దృష్టితోనే గాంధీజీ సామాన్య ప్రజలకోసం సామాన్య ప్రజలు ఉత్పత్తి చేయడం అనే సూత్రాన్ని ప్రవచించారు. ఇందుకు ప్రాతిపది కలు ఆరు (1) తయారయ్యే వస్తువులు ఎక్కువమందికి అందుబాటులో ఉండాలి. (2) అవి ఇతర సమస్యలను సృష్టించకూడదు. (3) కొత్త వస్తువుల అన్వేషణ అధిక ఆదాయాల సృష్టికి ఆధారం కాకూడదు. సూపర్ టెక్నాలజీలో క్రొత్త వస్తువులు అధిక ఆదాయాలకు కారణం, ఫలితం కూడా అవుతున్నాయి. (4) వ్యక్తుల పొదుపుకన్న సంస్థల పొదుపుకు ప్రాధాన్యం యివ్వాలి. (5) అవసరాలపై కాక కోర్కెలపై ఆధారపడిన ఉత్పత్తిని నిషేధించాలి. (6) టెక్నాలజీ వికాసంతో పాటు మనిషి, సంస్థలు, సంస్కృతి వికాసం పొందాలి. (గాంధీ టుడే)

## ఉత్పత్తి యూనిట్‌గా కుటుంబం

ప్రజలందరికీ పని కల్పించడం మన అభివృద్ధికై జరిగే కృషికి మౌలిక లక్ష్యం కావాలి అని దీనదయాళ్ ఉపాధ్యాయ ప్రతిపాదించారు. దేశరక్షణ, కనీస అవసరాలు తీరతాయనే హామీ, వికేంద్రీకరణ మిగిలిన లక్ష్యాలు కావాలి. ఆయన దృష్టిలో వికేంద్రీకరణకు మూలం-వ్యక్తి, కుటుంబం. వ్యక్తి, కుటుంబం కలసి పనిచేయటంవలన దోపిడికి అసమానతలకు అవకాశం ఉండదు కుటీర, చిన్నతరహా పరిశ్రమలు పారిశ్రామికీకరణకు ప్రాతిపదికలు కావాలి. ఇందులకై విద్యుచ్ఛక్తిని, యంత్రాలను వినియోగించాలి. మామూలు అవసరాలకు పనికివచ్చే వస్తువులలో తొంభై శాతం పైగా ఇలా ఉత్పత్తి చేయగలం. మిగతా వాటిని పెద్ద పరిశ్రమలలో ఉత్పత్తి చేయవచ్చు...ఆ పరిశ్రమలలో కూడ–చిన్నతరహా పరిశ్రమలలో తయారయ్యే వస్తువులను పోగుచేయడం, అమర్చడం మాత్రమే సాధారణంగా అవసరం అవుతాయి. ఇదీ దీనదయాళ్ ఉపాధ్యాయ సూచన.

## స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్

'స్మాల్ ఈజ్ బ్యూటిఫుల్' అనే గ్రంథంతో ఆర్థిక శాస్త్రవేత్తలలో సంచలనం సృష్టించిన ఈ.ఎఫ్ షుమాఖర్ చిన్నపరిశ్రమలలో సౌకర్యం, మానవత్వం, నిర్వహణకు అనుకూలత ఉన్నాయని సిద్ధాంతీకరిస్తారు. మనిషి చిన్నవాడు కనుక 'చిన్నతరహా టెక్నాలజీ ఉపయుక్తం అంటారు. లక్షలాది పనిస్థలాల ఏర్పాటు మన ప్రణాళికా రచనకు ప్రాథమిక లక్ష్యం కావాలంటూ అందుకు నాలుగు సూత్రాలు ప్రతిపాదించారు. (1) ప్రజలు ఇప్పుడు నివసిస్తున్న స్థలాలలోనే పనిస్థలాలు ఏర్పాటు చేయాలి. (2) అవి చవకగా ఉండాలి. (3) ప్రధానంగా స్థానిక వనరులు ఆధారంగా స్థానికుల కోసం ఉత్పత్తి జరగాలి. ఇందుకోసం జిల్లాస్థాయిలో పథకాలు

రూపొందించాలి. ఆర్థికంగా అభిరుచి, సంఘటనా సామర్థ్యాల పరంగా, విద్యాపరంగా అవి ఆయా జిల్లాల ప్రజలకు అందుబాటులో ఉండాలి. (4) పరికరాలు సరళంగా ప్రజలకు అర్థమయ్యేవిగా ఉండాలి. చిన్నవిగా తేలికగా చౌకగా ఉండాలి. స్థానికంగా మరమ్మతు చేయడానికి అనువుగా ఉండాలి.

గృహనిర్మాణ సామగ్రి, బట్టలు, గృహోపకరణాలు, వ్యవసాయ పరికరాలు, చెట్లు, నీరు, వ్యవసాయోత్పత్తికి గిట్టుబాటు ధర, ఆ ఉత్పత్తిని నిలువ చేసుకునే సదుపాయాలు పేద ప్రజలకు కావాలి. వీటన్నిటికంటే ముఖ్యంగా తాము ఉత్పత్తి చేసిన ముడిసరుకును తామే వినియోగదారునికి పనికివచ్చే వస్తువుగా తీర్చిదిద్దటానికి అవకాశం కావాలి. ఈ అవసరాలన్నింటినీ ముందు సూచించిన పని స్థలాలద్వారా తీర్చవచ్చు.

ప్రజల టెక్నాలజీకి మరో లక్షణం కనీస నిర్వహణకు అవసరమయ్యే వ్యవస్థలు ఏర్పాటు కావడం. బాగా చిన్నచిన్న వ్యవస్థలు తమకు తామే నిర్వహించుకుంటాయి. కాగితాల మీద నియమాలు నిబంధనలు తయారుచేసే అవసరం తగ్గుతుంది. సమస్యనంతటినీ సమగ్రంగా పరిశీలించి అక్కడికక్కడే నిర్ణయం తీసుకోవడం జరుగుతుంది. సంప్రదించడం తేలికవుతుంది. వ్యవస్థ పరిమాణం పెరిగేకొలదీ అధికారవర్గం పెరిగిపోతుంది, ఆ అధికార వర్గానికి సామాన్యుడి కష్టసుఖాలతో పని లేదు. నిరంకుశ ధోరణి ప్రబలుతుంది.

## ప్రజలంతా పాల్గొనే టెక్నాలజీ

ప్రజల టెక్నాలజీకి ఏడు ప్రధాన లక్షణాలు ఉన్నాయి. 1) ఆ టెక్నాలజీ ఆయా పరిస్థితులలో ఇమిడిపోతుంది. 2) పెట్టుబడి పొదుపు అవుతుంది. 3) పారిశ్రామిక సదుపాయాల అవసరం చాలా తక్కువగా ఉంటుంది. అంటే పెట్టుబడి అంతా రోడ్ల మీద షెడ్లమీద

ఇలాంటివే ఇతర సదుపాయాల మీద ఖర్చు చేయవలసిన అవసరంలేని స్థలాలలో ఉత్పత్తి జరుగుతుంది. 4) ఆ టెక్నాలజీ పెట్టుబడి కోసమై పొదుపును నిర్మాణం చేస్తుంది. 5) వీలైనంత ఎక్కువ మందికి పని దొరుకుతుంది. 6) ఆ టెక్నాలజీవల్ల సంపద మరింత సమానంగా పంపిణీ అవుతుంది. 7) టెక్నాలజీని రూపొందించటంలో సామాన్య ప్రజలంతా పాల్గొంటారు.

## చిన్న తరహా చమురు శుద్ధి

దేశంలో 66 రకాల వికేంద్రిత పరిశ్రమలున్నాయని శ్రీ వి.యల్ మెహతా ధర్మ కర్తృత్వంపై వ్రాసిన గ్రంథంలో వ్రాసారు. ఈ పరిశ్రమల నిర్వహణా సామర్థ్యాన్ని పెంచడానికి శ్రమించే వ్యక్తుల శ్రమను తగ్గించటానికి శాస్త్ర విజ్ఞానాన్ని సాంకేతిక శాస్త్రాన్ని మలచవలసి ఉంది. బయోగ్యాస్, కార్డింగ్, నూలువడకడం, చేనేత, తోళ్ళ పరిశ్రమలలో అనుగుణమైన టెక్నాలజీని రూపొందించడంలో కొంత ప్రగతిని సాధించాం. ఇతర రంగాలకు ఇది విస్తరించాలి. చిన్న తరహా విద్యుదుత్పత్తి చిన్న తరహా చమురు శుద్ధి, చిన్న తరహా అమ్మోనియం ఉత్పత్తి ఇందుకు ఉదహరణలు

## బుద్ధి ప్రధానమైన పరిశ్రమలు

ప్రజల టెక్నాలజీని రూపొందించుకోవడంలో మనం జపాను దేశం నుంచి నేర్చుకోవలసింది చాలా ఉంది. అక్కడ టెక్నాలజీ మొదట శ్రమ ప్రధానమైన పరిశ్రమలలో ఉపయోగించారు. ఇప్పుడు బుద్ధి ప్రధానమైన పరిశ్రమలకు కూడ టెక్నాలజీని విస్తరింపజేశారు. ప్రముఖ ఫ్రెంచి రచయిత జాన్ జక్విస్ సెర్విన్, స్క్రైబర్ వ్రాసిన "ది వరల్డ్స్ ఛాలెంజ్" అనే గ్రంథంలో ఈ విషయాన్ని విపులంగా వర్ణించారు. మనిషి మెదడుకు శిక్షణ ఇవ్వడం ద్వారా అందరికీ పనికల్పించడం మాత్రమేకాక, ప్రతి వ్యక్తిలో ఉన్న శక్తి సామర్థ్యాలను పూర్తిగా వినియోగించుకోవచ్చు అనే

విషయాన్ని జపాను దేశపు ప్రయోగం నిరూపిస్తుంది. సమాచారాన్ని 'సిలికాన్ చిప్'లేదా 'మైక్రో చిప్' అనే సాధనాల్లో నిల్వ చేస్తారు. మైక్రో ప్రొసెసర్ కంప్యూటర్ ఆన్ ఏ చిప్ ద్వారా మనిషి మనస్సును ఉత్పత్తి సాధనంగా మారుస్తారు. అంటే మైక్రో కంప్యూటర్ల ద్వారా మనిషిలోని మానసిక శక్తులను, సృజనాత్మక శక్తులను వికసింప చేస్తారు. ఆ మైక్రో కంప్యూటర్లు ఏవ్యక్తికి ఏ సమాచారం అవసరమైతే ఆవ్యక్తికి ఆ సమాచారాన్ని అందించే విధంగా రూపొందిస్తారు.

విద్యారంగంలో ఈ పద్ధతిద్వారా ఉద్యోగాలను ఎన్నో రెట్లు పెంచ గలుగుతున్నారు. మినీ కంప్యూటర్ల సహాయంతో ఎవరి అభిరుచికి తగినట్లు వారికి చదువు చెప్పే పద్ధతిని ప్రవేశపెట్టవచ్చు. అంటే అందరికీ మూసలో పోసినట్లు ఒకే చదువు నేర్పరు. జ్ఞానాన్ని నిల్వ చేసుకునే విద్య బదులు పంపిణీచేసి ఉత్తేజ పరచే విద్య నేర్పుతారు. దీనికోసం ప్రత్యేక శిక్షణ పొందిన అధ్యాపకులను నియమిస్తారు. ఏవో కొన్ని సంవత్సరాలపాటు మాత్రమేకాక జీవితకాలమంతా తమ తమ సామర్థ్యాలను వికసింపజేసుకునే అవకాశం వ్యక్తులకు కల్పిస్తారు. ఇందుకై ప్రత్యేక శిక్షణ పొందిన అధ్యాపకులు అవసరం అవుతారు. పరీక్షలు. మార్కులు అనే పద్ధతికి బదులు శాశ్వతమైన వ్యక్తి గతమైన అంచనా జరుగుతుంది. మనసును సవాలు చేసే కొత్తకొత్త క్షేత్రాలను కనుగోవడం జరుగుతుంది ఇలా వ్యక్తుల సృజనాత్మక శక్తికి శిక్షణ ఇచ్చి దానిని వినియోగపరచటానికి చాలామంది అధ్యాపకులు అవసరం అవుతారు.

వైద్యంలో కూడ ఇలాంటి విప్లవాత్మక పరివర్తన తీసుకురావచ్చు. ప్రతి ఇంట్లోనూ విద్యుచ్ఛక్తి మాదిరి కంప్యూటర్లను అమర్చి వాటి ద్వారా విద్యా కార్యక్రమాలు వైద్యం పిల్లల ఆటలు అందించవచ్చు. ఇటువంటి ప్రయోగాలనుండి మనం కూడ ప్రయోజనం పొందవచ్చు.

## సమష్టి యోజన సంప్రదాయం

జపాన్‌నుంచి మనం నేర్చుకోవలసింది చాల ఉంది. "పెరగాలి పెరగాలి పరిశ్రమ పెరగాలి, పరిశ్రమతోపాటు సామరస్యం, చిత్తశుద్ధీ పెరగాలి" అని అర్థం వచ్చేపాట ప్రతిరోజూ పని ప్రారంభించే ముందు పరిశ్రమలోని వారంతా బృందగానంగా పాడతారు. మేమంతా కార్మికులమే అంటారు తోషిబా కంపెనీ మేనేజింగ్ డైరెక్టరు. ఆయన పూర్వం కార్మిక నాయకుడు.

జపాన్ పరిశ్రమలో మరో ప్రధానాంశం సామూహికమైన ఆలోచన. దానిని జపాన్ భాషలో 'షచి' అంటారు. పారిశ్రామిక ప్రజాస్వామ్యం అక్కడ చక్కగా అమలు జరుగుతోంది. అన్నదానికి 'షచి' ఒక ఉదాహరణ. కార్మికులకు విస్తృతమైన శిక్షణ ఇవ్వబడుతుంది. కనుక వారు చర్చా సమావేశాలలో పాల్గొని ఉత్పత్తులూ నాణ్యతా పెంచడానికి సలహాలు ఇవ్వగలరు. ప్రతి కంపెనీకో ఇలాంటి చర్చా సమావేశాలు జరుగుతూ వుంటాయి. ఉత్పత్తి యొక్క నాణ్యత తగ్గకుండా చూసే బాధ్యత మరెవరిదో కాదని అది తనదే అని కార్మికుడు ఎప్పుడూ ఆలోచిస్తాడు. ఉత్పత్తీ, నాణ్యతా కలసి మెలిసి ఉంటాయి. సూపర్ వైజర్ల అవసరం లేనేలేదు.

సౌర శక్తి ఉత్పత్తిలో కూడా జపానుదే అగ్రస్థానం. 38 లక్షల సౌరశక్తి హీటర్లు ఇళ్ళ కప్పులకు అమర్చారు. సన్ షైన్ ప్రాజెక్టు క్రింద మిగతా ఇళ్ళకు కూడా ఈ హీటర్లు అమర్చే ప్రయత్నం జరుగుతోంది. భూ గర్భంలోని ఉష్ణశక్తి వనరులను సర్వే చేసి, ఆ ఉష్ణ శక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చే ప్రయత్నాలు కూడా భారీ ఎత్తున జరుగుతున్నాయి.

# ఎద్దుల బండీ జెట్ విమానం— రెండూ అవసరమే

టెక్నాలజీని గురించి ఆలోచించేటప్పుడు కొన్ని వాస్తవాలను మనం గ్రహిస్తే ఎన్నో భ్రమలు తొలగి పోతాయి. శాస్త్ర విజ్ఞానం యంత్రాలు పరికరాల వలన జరగలేదు. సాంకేతిక శాస్త్ర విజయం కూడ యంత్రాల వలన మాత్రమే సంభవించలేదు. జ్ఞాన సముపార్జన శాస్త్రాల ద్వారా మనం సాధించిన ముఖ్యమైన విజయం. ఆ విధంగా సమకూర్చుకున్న జ్ఞానాన్ని రకరకాలుగా ఉపయోగించు కోవచ్చు. పాశ్చాత్య దేశాలు తమ సాంస్కృతిక విలువలకు స్థితి గతులకు అనుగుణంగా సూపర్ టెక్నాలజీని రూపొందించుకున్నాయి. మనం, మన సాంస్కృతిక విలువలకు, వనరులకు స్థితిగతులకు అనుగుణంగా భారతీయమైన స్వదేశీ టెక్నాలజీని రూపొందించుకోవాలి. అలా రూపొందించుకునే సమయంలో దే.నీ వ్యతిరేకించ వలసిన అవసరం లేదు. ఎద్దు బండీ జెట్ విమానము- రెండు అవసరమే. ఆ అవసరాన్ని గుర్తిస్తూ ఆధునిక సాంకేతిక విజ్ఞాన ప్రగతిని అర్థం చేసుకుంటూ మన ఆర్థికాభివృద్ధి లక్ష్యాలకు అనుగుణంగా టెక్నాలజీని మలచుకోవాలి. అందే టెక్నాలజీని సహజత్వం వైపు చేతనత్వం వైపు మృదుత్వం వైపు అహింస వైపు సౌందర్యం వైపు సృజనాత్మకత వైపు మళ్లించాలి.



# 10

# బయోటెక్నాలజీ బంగారు పంట

మనిషి కేంద్రంగా మానవత్వపు విలువలు ఆధారంగా విజ్ఞానాన్ని ఉపయోగించుకునే కృషిలో బయోటెక్నాలజీకి చాలా ముఖ్యమైన పాత్ర ఉంది. పాశ్చాత్య భావప్రేరితులైన మన ఆర్థిక నిపుణుల ఆలోచనలో ఆర్థికాభివృద్ధి అంటే పారిశ్రామికీకరణ అనీ, పారిశ్రామికీకరణ అంటే పెద్ద యంత్రమనీ స్పష్టమవుతోంది. వీరి దృష్టికి ప్రకృతి మనకు ప్రసాదించిన సంపద కనపడదు. జనసంపద, భూసంపద, వనసంపద, జలసంపద పశు సంపద వంటి సహజవనరులను సక్రమంగా ఉపయోగించుకుంటే అందుకోసం విజ్ఞానాన్ని గూడా ఉపయోగిస్తే మనం జోలె పుచ్చుకుని ప్రపంచంచుట్టూ తిరిగే దయనీయ స్థితి ఉండదు. అలా సహజ వనరులను ఉపయోగించుకోవటం నేర్పే శాస్త్రమే బయోటెక్నాలజీ - జీవసాంకేతిక శాస్త్రం.

## విద్య - సంఘటన - శిక్షణ

ఆర్థికాభివృద్ధికి అన్నిటికన్నా ముఖ్యమైన వనరు మనిషి నుంచి, మనిషి మనసు నుంచి వస్తుంది. ఆర్థిక శాస్త్రంకన్నా ముఖ్యమైన విషయం ఆర్థికాభివృద్ధి. ఆర్థికాభివృద్ధికి పునాదులు ఆర్థిక రంగానికి బయటే ఉన్నాయి. విద్యలో, సంఘటనలో, క్రమశిక్షణలో ఆ పునాదులున్నాయి. ఒక వ్యక్తికి ఒక చేపను ఇస్తే, అతనికాపూట గడుస్తుంది. కానీ చేపలు

పట్టడం నేర్పి వలయా గట్టా తయారు చేయడం కూడా నేర్పితే ఆ వ్యక్తి తన జీవితమంతా ఇంత తిని ఇంకో నలుగురికి కూడా ఇంత పెట్టగలడు అంటారు షుమాఖర్.

భౌతికమైన ధనాభివృద్ధి చాలా వరకు మానవశక్తి అనే పెట్టుబడిని పెంచుకోవటంపైనే ఆధారపడి ఉందనీ అందుకోసమై ప్రజల జ్ఞానాన్ని శక్తి సామర్థ్యాలనూ పెంచే ప్రక్రియలకు ప్రాధాన్యంఇవ్వాలని పాశ్చాత్య ఆర్థిక శాస్త్రవేత్తలు చాలా మంది ఇప్పుడు అంగీకరిస్తున్నారు. కర్మాగారాలపైచేసే ఖర్చు కంటే విద్యారంగంపై పెట్టే ఖర్చు జాతీయాదాయాన్ని పెంచుతుందని కూడ వారు అంగీకరిస్తున్నారు అమెరికాలో 1900 నుండి 1956 వరకు విద్యారంగంలో పెట్టిన ఖర్చు ఇతర రంగాలలో పెట్టిన ఖర్చు కన్న 3.5 రెట్లు ఎక్కువ ఉత్పాదకంగా ఉన్నదని నోబెల్ బహుమతి గ్రహీత. టి. డబ్ల్యు. షుల్ట్జ్ నిరూపించారు. జాన్‌గాల్ బ్రెయిత్ కూడ మానవశక్తిని పెంచటానికై చేసే ప్రయత్నం ప్రయోజనకారి కాగలదని అన్నారు.

## మానవశక్తి–పనిలో సామర్థ్యం

మన దేశంలో విద్యకు తగిన ప్రాధాన్యం పోయింది. ప్రతి ముగ్గురిలో ఇద్దరు నిరక్షరాస్యులే. అందువలన మానవశక్తిని సక్రమంగా సంపూర్ణంగా అంచనా వేయటానికి చేయవలసిన సర్వే గురించి ఎవరూ ఆలోచించటం లేదు. మనదేశంలో ఎంతమంది నిరుద్యోగులున్నారో ప్రణాళికా సంఘానికి కూడా తెలియదు మనకున్న జనసంపద అపారం. ఆ జనం యొక్క శక్తి సామర్థ్యాలు ఎలాంటివి. వాటిని ఎలా ఉపయోగించుకోవాలి అనే విషయాలను అర్థం చేసుకుని తదనుగుణంగా మన ఆర్థిక ప్రణాళికల రచన జరగాలి. వృత్తికళలో నైపుణ్యమున్న వాళ్ళు స్వయం వృత్తుల ద్వారా తమ జీవనాన్ని సాగించగలిగినవాళ్ళ

ఎంతో మంది ఉన్నారు. వారి ఉత్పత్తి పద్ధతులను మెరగు పరచి నైపుణ్యాలను పెంపొందించే టెక్నాలజీని మనం తయారు చేసుకోవాలి. పాశ్చాత్య దేశాలకు అనుగుణమైన భారీ పరిశ్రమల టెక్నాలజీని మనం దిగుమతి చేసుకుంటే మనుషులలో నిరుత్సాహమూ, నిరాశా పెరగటం తప్ప మరేమీ సాధించలేం.

## సహజ గుణాన్ని కనుగొనే సాధనం

మరో మౌలిక విషయం ఉన్నది. తన సహజ ప్రవృత్తులకూ లక్షణాలకు గుణాలకు లభిరుచులకు అనుగుణమైన పనిని చేసినప్పుడు మనిషి ఆనందాన్ని పొందగలడు. కుశలత సంపాదించగలడు. అంతే కాదు. వ్యక్తిగా ఎదగగలడు. ఏ మనిషి ఏ పనికి అర్హుడో నిర్ణయించే శక్తి యోగం ద్వారా లభిస్తుంది. పూర్వం గురుకులాలలో మహర్షులు ఆ విషయాన్ని కనుగొనేవారు. ఆ విధంగా సహజ స్వభావానికి అనుగుణమైన పని ఇవ్వగలిగితే వ్యక్తి జీవితం సార్థకం అవుతుంది. సామాజిక జీవనంలో సామరస్యం సమన్వయం నెలకొంటాయి. ఇప్పుడు పాశ్చాత్య దేశాలలో ఎర్గోనమిక్స్ అనే శాస్త్రాన్ని రూపొందించి సహజ గుణాలను కనుగొనే పరీక్షలు (Autitude tests) జరుపుతున్నారు. అయితే ఆ శాస్త్రం ఇంకా శైశవ దశలోనే ఉంది.

## బంజరుగా మారుతున్న భూమాత

మనుషులకే విలువ ఇవ్వని టెక్నాలజీ పరిసరాలకు విలువనిస్తుందా. ఆ టెక్నాలజీకి భూమాత, గోమాత, గంగామాత అనే ప్రజల నమ్మకాలకు చుక్కెదురు. కనుకనే భూమి నిర్లక్ష్యానికీ, పశుసంపద హింసకూ జలసంపద కాలుష్యానికీ గురవుతున్నాయి. మనది పేదదేశం జనాభా వత్తిడి హెచ్చు. కనుక కొండకోనలలో భూసంపదను నమ్ముకుని బ్రతుకుతున్న పేదప్రజలు అల్లాడి పోతున్నారు. మనఆర్థిక సామాజిక

భౌతిక అధ్యాత్మిక అవసరాల పరితృప్తికి సహజ వనరులను సమకూర్చే ప్రకృతి నిర్లక్ష్యానికి గురైతే సుఖం ఎక్కడుంటుంది, శాంతి ఎక్కడుంటుంది.

పిండుకోవటమేగాని పోషించటం తెలియని నేటి నాగరిక మానవుని చేతుల్లో సస్యశ్యామల అయిన మన భూ మాత బంజరుగా మారిపోతోంది. ఈ శతాబ్దం చివరికి మన దేశ జనాభా 100 కోట్లదాకా పెరుగుతుంది అని అంచనా వేస్తున్నారు. అంటే ప్రస్తుతం ఉత్పత్తి అవుతున్న 130 మిలియన్ టన్నుల నుంచి 240 మిలియన్ టన్నుల దాకా ఆహార ధాన్యాల ఉత్పత్తి పెరగాలి. 1971లో 140 మిలియనుల హెక్టార్ల భూమి సాగులో వుంది. ఈ శతాబ్దం చివరకి 145 మిలియన్ల హెకారుల భూమి మాత్రమే సాగులో ఉంటుంది అని జాతీయ వ్యవసాయ కమీషన్ అంచనా వేసింది. అంతేకాదు ప్రస్తుతం సాగులో ఉన్న భూమిలో దాదాపు 60 శాతము భూమికి భూసార పరిరక్షణ చర్యలు అవసర మవుతాయి ఈ స్థితిలో సత్వరం చర్యలుతీసుకుంటే తప్ప ప్రజలందరి ఆహార అవసరాలు తీరే అవకాశం లేదు.

## క్రుంగి కృశిస్తున్న వనదేవత

వన సంపద విషయం కూడా దారుణ గా వుంది. మన కలప వినియోగం ఉత్పత్తికి నాలుగు రెట్లు వుంటోంది ఈ ధోరణి యిలాగే కొనసాగితే 10, 15 సంవత్సరాలలో మన వనసంపద తరిగి పోవచ్చనీ నిపుణుల అంచనా. అడవుల వలన భూసార రక్షణ జరుగుతుంది. ఎడారుల విస్తరణ ఆగిపోతుంది. వరదల నివారణ కూడా వీలవుతుంది. రిజర్వాయర్లలో కాలువలలో ఒండ్రు మట్టి పేరుకు పోకుండా వుంటుంది. అటవీ సంపద అభివృద్ధికై దిగువ చర్యలు తీసుకోవాలి. (1) అటవీ సంపదను పెంపొందించే పని వన వాసులకు అప్పగించాలి. (2) చెట్లు

నరికి కట్టెలు అమ్ముకొని బ్రతికే వారికి మరో వృత్తి చూపించాలి (3) పేద ప్రజలు అడవులు నరికే అవసరం రాకుండా వంట చెరకు, పశు గ్రాసానికీ, ఇళ్ళు కట్టుకోవడానికీ తగు సదుపాయాలు కల్పించాలి. (4) రైతులకు చెట్లు పెంచడానికై ఆర్థిక సహాయం అందించాలి.

దేశంలోని ప్రతి ప్రయోజనుడూ ఏడాదికొక మొక్క చొ॥న ఐదేళ్ళపాటు చెట్లు నాటి పెంచితే 00 కోట్ల చెట్లు తయారవుతాయి ఒక పంచ వర్ష ప్రణాళిక సాధించే దానికన్నా ఈ చెట్ల విలువ చాలా ఎక్కువ. విదేశీ సహాయం లేకుండా, అంతర్జాతీయ ద్రవ్య సంస్థల అడుగులకు మడుగులొత్తకుండా, విదేశీ ఆర్థిక నిపుణుల సలహాలు అవసరం లేకుండా విద్యుచ్ఛక్తి సిమెంటు, ఉక్కు ఉపయోగించకుండా ఈ పథకాన్ని అమలు జరపవచ్చు దీని వలన ఆహార పదార్థాల, వస్త్ర పరిశ్రమ ముడి సరుకు, గృహ నిర్మాణ సామాగ్రి, నీరు లభిస్తాయి వరదల నిరోధం భూసార పరిరక్షణ జరుగుతాయి. ఒక్క మాటలో మనిషికి అవసరమయ్యే వస్తువులన్నీ అతని చేతికి అందుతాయి.

## నదుల దండ

మన జలాలు సంపద మరో వనరు. మన నదీ జలాల సమగ్ర వినియోగానికై డాక్టర్. యం. విశ్వేశ్వరయ్య, డాక్టర్ సి పి. రామస్వామి అయ్యర్ లు గంగా- కావేరి పథకాన్ని సూచించారు. ఆ తరువాత డాక్టర్ కె. యల్. రావు వివరాలను రూపొందించారు.

డి. జె. దస్తూర్ "నదుల దండ" పథకంగా దానిని ప్రభుత్వానికి అందజేసారు. ఈ పథకంలో 1200 మైళ్ళ హిమాలయ కాలువ, 5, 800 మైళ్ళ నదుల దండ కాలువ త్రవ్వాలి. ఏడాదికి 1000 కోట్ల

రూపాయల ఖర్చుతో 14 ఏళ్లలో ఈ పథకాన్ని పూర్తి చేయవచ్చు అప్పుడు కరువు కాటకాలు దేశంనుంచి శాశ్వతంగా నిష్క్రమిస్తాయి. జలవిద్యుత్పథకాలు స్థాపించి కోట్లాది ప్రజలకు పని కల్పించవచ్చు

## గంగానది నిండా కాలుష్యం

దురదృష్టమేమంటే నదుల దంధ పథకం అలాగే ఉంది. దానికి తోడు పరిశ్రమల మాలిన్యం పట్టణాల మాలిన్యం మన జలసంపద 70 శాతాన్ని కలుషితం చేస్తున్నాయి. అన్ని నదుల్లోకన్నా గంగానదిలో ఈ కాలుష్యం ఎక్కువ. అది నాగరికత పేరుతో గంగామాతకు మనం ఇచ్చిన ప్రత్యేకకానుక. ఈ పారిశ్రామిక కాలుష్యంవల్లన యమునానదికి ఉపనదీ, రాజస్థాన్‌లో కల్లా పెద్దనదీ అయిన చంబల్‌నీరు తాగడానికి కూడా పనికి రాకుండా పోతోంది జలకాలుష్యంవల్ల వచ్చే రోగాలవల్ల ఏటేటా షుమారు 7.3 కోట్ల పనిదినాలు నష్టమవుతున్నాయి.

## పోషకాహారానికి గోమాత సేవ

ప్రతి గ్రామీణ కుటుంబానికీ ఒక మేలుజాతి ఆవును ఇచ్చే పథకాన్ని చేపట్టి 10 సంవత్సరాలలో 5 000 కోట్ల రూపాయలతో మన గ్రామీణ జీవనానికి కాయకల్ప చికిత్స చేయవచ్చు రైతులకూ అదనపు ఆదాయం, భారీఎత్తున ఉపాధికల్పన, వ్యవసాయ పనులకు రవాణాకు మేలురకం ఎడ్లు అన్నింటినీమించి దేశ ప్రజలకు చౌకగా సమృద్ధిగా పాలు ఈ పథకం వల్ల లభ్యమవుతాయి. పోషకాహార లోపంవల్ల దేశంలో 5 కోట్ల మంది పిల్లలు, క్షీణించిపోతున్నారు. దేశం అర్భకులకు, అష్టావక్రులకు రాను రాను నిలయమవుతున్నదనే విషయాన్ని ఊహించుకోవటమే బాధాకరంగా ఉంది. పాలు పుష్కలంగా అందించటంవల్ల ఈ లోపాన్ని మనం రూపుమాపవచ్చు.

1982లో మేగససే అవార్డు పొందిన ప్రముఖ గాంధేయవాది డాక్టర్ మణీభాయిదేశాయ్ గోసంపదను ఆధునిక పద్ధతులతో అభివృద్ధిచేసి చూపించుచున్నారు. మహారాష్ట్రలోని ఉరిళికాంచన్‌లోని 100 ఎకరాల క్షేత్రంలో 800 మంది పరిశోధకులు 300 కేంద్రాల ద్వారా 5 లక్షల కుటుంబాలకు చెందిన 8 లక్షల ఆవులకు తమ పరిశోధనా ఫలితాలను అందిస్తున్నారు. ఆయా ఆవుల వివరాలన్నీ ఒక కేంద్ర కంప్యూటర్లో నమోదై వుంటాయి. ఆ వివరాలు ఆధారంగా పశు వైద్యులు మోటారు సైకిళ్ళపై ఇళ్ళకు వెళ్ళి వైద్య సేవలు అందిస్తున్నారు. క్షేత్రంలో మేలు రకం ఆవుల ఉత్పత్తికి ఆధునిక పద్ధతులను అనుసరిస్తున్నారు. సు-బాబుల్ అనే వృక్షాన్ని గ్రామాలలో పెంచే పథకాన్ని, చిన్న చిన్న చెరువుల ద్వారా వర్షపు నీటిని నిల్వ చేసే పద్ధతినీ, సమగ్ర గ్రామీణాభివృద్ధికి ఉపయోగిస్తున్నారు. ఇంకా అనేక పథకాలను కూడా ఉపయోగిస్తున్నారు

## 'పంకజ లక్ష్మి'

పశు పోషణలో అంతర్భాగంగా గోబర్ గ్యాస్ ప్లాంటుల ద్వారా గ్రామాలకు ఇంధనాన్ని, విద్యుచ్ఛక్తినీ సేంద్రియఎరువునూ సరఫరా చేయవచ్చు. మధ్యప్రదేశ్ నీటి పారుదల శాఖ హై ప్రెషర్ పోర్టబుల్ గోబర్ గ్యాస్ ప్లాంటును; పోర్టబుల్ గ్యాస్ టర్బైన్‌ను రూపొందించింది కూడా. పట్టణాలలో బయటికివచ్చే డ్రైనేజీ నీటినుండి, చెత్త నుండి కూడా బయోగ్యాస్ తయారు చేయవచ్చు. బెంగుళూరులో "పంకజ లక్ష్మి" పేరు పథకం క్రింద అలా చేస్తున్నారు.

బయోగ్యాస్ డైజస్టర్లు మన దేశంలో షుమారు 12,000 ఉండగా చైనాలో 70 లక్షలకు పైగా ఉన్నాయి. చైనాలో డైజస్టర్లు వంట

గ్యాస్‌కు మాత్రమే గాక, ఇళ్లలో దీపాలను పంటలు ఎండబెట్టడానికి చిన్ని చిన్న జనరేటర్లు నడపటానికీ ఉపయోగ పడుతున్నాయి.

అలాగే మన దేశంలో మత్స్య పరిశ్రమను, సముద్రపు నాచు పరిశ్రమను అభివృద్ధి చేసి ఉపాధి కల్పనకూ, ప్రజలకు మరింత సంతులిత ఆహారాన్ని అందించటానికి ఉపయోగించ వచ్చు.

## ప్రకృతి మాత కన్నీటి కాలువ

పారిశ్రామికీ కరణ పేరిట పరిసరాలను నిర్లక్ష్యం చేయటంతో ప్రకృతి మాత కన్నీరు కాలువలయి ప్రవహిస్తోంది. ఢిల్లీలోని పరిసర శాస్త్ర విజ్ఞాన కేంద్రం ప్రచురించిన "1982లో భారత దేశ పరిసరాల పరిస్థితి" అనే గ్రంథంలో మన పరిసరాలు ఎంత భయానకంగా తయారయ్యాయో వివరించారు.

దేశంలో ఇళ్ళు కట్టడానికి కావలసిన ఇటుకలను తయారు చేయటానికి ఉపయోగించే మట్టికన్నా ఎక్కువ భూ సారం ప్రతి ఐదారు నెలలలో తుడిచి పెట్టుకుపోతోంది. ఏటేటా షుమారు 1.5 లక్షల హెక్టార్ల అడవులు నరికి వేస్తున్నారు. గత 30 సంవత్సరాలలో 45 లక్షల హెక్టార్ల అడవులు నరకివేస్తే కొత్తగా 20 లక్షల హెక్టార్లలో మాత్రమే అడవులను పెంచారు. మన నీటి పారుదల పథకాలు అనేకం లాభం కంటే నష్టాన్నే ఎక్కువగా ఇస్తున్నాయి.

మన గ్రామీణ జనాభాలో 70 శాతానికి రక్షిత నీటి సరఫరా సౌకర్యం లేదు 98 శాతానికి మరుగు దొడ్లు లేవు. దేశంలో 3110 పట్టణాలుంటే వాటిలో 217 పట్టణాలకు మాత్రమే మురుగు నీటి పారిశుధ్య సౌకర్యాలున్నాయి. అందుకనే మన దేశంలో ఎక్కువగా టైఫాయిడ్, కలరా వంటి అంటు వ్యాధులు ప్రబలుతుంటాయి.

వంట ఇంధనం ప్రభావం పరిసరాల మీద ఎక్కువగానే ఉంటుంది. మన మొత్తం ఇంధనం వాడకంలో వంట ఇందనం వాడకం సగం ఉన్నా దాని సరఫరాకు ఒక జాతీయ విధానం మాత్రం లేదు.

మనిషికి ప్రకృతిమాతతో, భూ మాతతో, గంగా మాతతో, గోమాతతో అవినాభావ సంబంధం ఉంది. అది గుర్తించక పోతే భయంకర పరిణామాలు తప్పవు. ఆ సంబంధాన్ని గుర్తించి బయోటెక్నాలజీ వికసింప జేసుకొనటం ద్వారా ప్రజల టెక్నాజీలని తీర్చిదిద్దుకొనటంద్వారా సూపర్ టెక్నాలజీ అవసరాన్ని తగ్గించ వచ్చు. మానవత్వపు విలువలను పెంచే విధంగా ఆర్థిక కార్య కలాపాలను మలచు కోవచ్చు.



# 11

# మనమంతా ధర్మకర్తలం

*ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని అమలు జరిపితే భారతదేశం ప్రపంచానికే ధ్రువతార కాగలదు. తన సాంస్కృతిక వారసత్వంలోని మహోన్నత ఆదర్శాలను పునరుజ్జీవింప చేయటంద్వారా తన ఆత్మనూ వ్యక్తిత్వాన్నీ పదిలపరచుకుంటూ **అత్యంత ఆధునికమైన** జాతిగా భారతదేశం రూపొందగలదు.*

ఇ. ఎఫ్. షుమాఖర్

భగవద్గీత అధ్యయనం ద్వారా తనకు ధర్మకర్త అనే పదానికి అర్థం స్ఫురించిందని గాంధీజీ తను ఆత్మకథలో వెల్లడించారు గీతలోని అపరిగ్రహం, లోకసంగ్రహం: సమత్వం, యజ్ఞం అనే నాలుగు పదాల వెనుకవున్న భావాలను రంగరిస్తే ధర్మకర్తృత్వ సిద్ధాంతం అనే ఔషధం సిద్ధిస్తుంది.

అపరిగ్రహం అంటే తనది అన్నది లేకపోవటం. ఆచరణలో పూర్తి అహింస సాధ్యం కానట్లే పూర్తి అపరిగ్రహం సాధ్యంకాదు. తనకు ఉన్నదానిని లోకసంగ్రహం కోసం అంటే అందరి మంచికోసం వినియోగించటం అపరిగ్రహంవైపు పయనించటానికి మార్గం. లోకసంగ్రహానికి ప్రేరణ ఇచ్చేవి. సమభావం, యజ్ఞభావన సమభావన అంటే సృష్టిలోని జీవరాసుల మధ్యగల సమాన ధర్మాన్ని గుర్తించడం, యజ్ఞభావన అంటే ఇదం న మమ (ఇది నాదికాదు) అంటూ తనకు ఉన్నదానిని

అర్పణ చేయటం. ఇలా సత్కర్మ యజ్ఞభావంతో ద్వారా లోకసంగ్రహ ప్రవృత్తి ఈ మూడింటి ద్వారా వ్యక్తి తనకు ఉన్నదానికి తాను ధర్మకర్త ను మాత్రమే అని భావించటం, ఆ భావన ఆచరణలో పెట్టడంద్వారా అపరిగ్రహంవైపు పయనించడం సాధ్యమవుతుంది ఇదే ఈ సిద్ధాంతానికి మూలసూత్రం.

## విత్తం అచ్యుత నిర్మితమ్

"ఈశావాస్య మిదం సర్వం। యత్కించ జగత్యాం జగత్।
తేన త్యక్తేన భుంజీథా। మాగృధః కస్యచిద్ధనం॥"

(పరమేశ్వరుడు ఈ జగత్తు అంతటా వ్యాపించిఉన్నాడు. కనుక సమర్పణ భావంతో దానిని అనుభవించు. పరులసొత్తుకు ఆశపడకు) అనే ఈశావాస్య ఉపనిషత్ శ్లోకాన్ని కూడా గాంధీజీ సిద్ధాంత వివరణలో ఉదహరించేవారు సోషలిస్టులు, కమ్యూనిస్టులు, తత్వవేత్తలు, ఆర్థికవేత్తలు, హైందవేతరుల అందరి తృష్ణనూ ఆ శ్లోకం తీరుస్తుందని ఆయన అభిప్రాయపడ్డారు. భగవంతుడు అంతటా వ్యాపించి ఉన్నప్పుడు అతడు ఇవ్వని దానిని దేనినీ నీవు అనుభవించలేవు. అంతా అతనిదే కనుక నీ శరీరంతోసహా నీది అంటూ ఏమీ లేదు. అజ్ఞానంవల్ల నీది అనుకున్న దానిని పరమేశ్వరుని పాదాలవద్ద అర్పించడం మరో జన్మ ఎత్తడం లాంటిది. అప్పుడు పరమేశ్వర ప్రసాదంగా నీకు కావలసింది లభిస్తుంది. కనుక జీవిత అవసరాలను అనుభవించాలంటే ముందు వాటిని సమర్పించాలి. ఇదీ గాంధీజీ ఈ మంత్రానికి చేసిన వ్యాఖ్య. "ప్రపంచంలోని మతగ్రంథాల పరిశోధనలో ఈ మంత్రానికి చేర్చవలసింది ఏదీ నాకు కనిపించలేదు" అంటారు గాంధీజీ విశ్వబంధుత్వం, పరమేశ్వరునిలో అచంచలమైన విశ్వాసం, సర్వసమర్పణ భావన, సర్వసమానత్వ భావన, మానవసేవా భావన—అన్నీ ఈ మంత్రంలో తనకు కనిపిస్తాయని అంటారు ఆయన.

అలాగే "భవం దిష్టం చాంతరిక్షం। విత్తం అద్యాగ నిర్మితం॥" (విత్తం అంతా పరమేశ్వర నిర్మితమే) అని చెబుతున్నది యోగవాసిష్ఠం. "తన సంపదను ఇతరులతో పంచుకునే వ్యక్తి మాత్రమే జీవించిఉన్న వ్యక్తి. ఈ సత్యాన్ని గుర్తించనివారు మరణించినట్లే. వారి భూమికి బరువు" అని బోధిస్తున్నది తిరుక్కురళ్. "యావత్ర్భియేత్ జఠరం తావత్ స్వత్వం హి దేహినామ్। అధికం యోభిమన్యేత సస్తేనో దండ మర్హతి॥" (తన కడుపు నిండడానికి అవసరమయ్యే సంపదను కలిగి ఉండే హక్కు మాత్రమే ఉన్నది. అంతకు మించిన సంపదను అంటి పెట్టుకు కూర్చునే వ్యక్తి దొంగతో సమానం దండనార్హుడు) అనే శ్లోకం కూడా ధర్మకర్తృత్వ భావాన్నే వ్యక్తం చేస్తున్నది.

ఇదంతా ధర్మకర్తృత్వ భావనలో సిద్ధాంత భాగం. ఇక అన్వయం గురించి. మనిషికీ మనిషికీ మధ్య ఆర్థికంగా సామాజికంగా ఉండే అసమానతలను తగ్గించవచ్చుకానీ ప్రకృతి సిద్ధమైన అసమానతలను తొలగించలేం. కనుక తనకున్న శక్తియుక్తులూ గుణగణాలూ సిరిసంపదలూ సమాజం కోసం ఉపయోగించబడాలనే తనకు ఇవ్వబడ్డాయని వ్యక్తి భావించడమే సమానత్వ సాధనకు మార్గం కాగలదు.

ధనవంతులు ఇలా తమ మిగులు ధనానికి ధర్మకర్తలుగా ఉండే అహింసాత్మక పద్ధతిలో సమానమైన పంపిణీని సాధించగలం. ఆర్థిక రంగంలో అహింస అంటే దోపిడీ చేయకపోవటమే. వ్యక్తి తనపైతాను అదుపును ఉంచుకోవటమే.

## పెట్టుబడీ శ్రమ పరస్పరం ధర్మకర్తలు

ఆస్తి నిజానికి ఇతరుల సహకారంతో ఆర్జించబడుతుంది. కాబట్టి ఆ ఆస్తిని స్వంతానికి మాత్రమే వాడుకునే హక్కు నైతికంగా ఏవ్యక్తికీ లేదంటారు గాంధీజీ. పెట్టుబడి శ్రమ ఒండొంటికి ధర్మకర్తలుగా పని

చేయాలి. రెండూ కలిసి వినియోగదారునికి ధర్మకర్తలు కావాలి. పెట్టుబడికీ శ్రమకూ మధ్య ఉన్న వివాదం అప్పుడు పరిష్కారమవుతుంది. యజమానికీ కార్మికునికీ వినియోగదారునికీ చివరికి భావితరాలకీ వ్యక్తి ధర్మకర్తగా మారతాడు.

మరో అడుగు ముందుకుపోతే ధర్మకర్తృత్వం అంటే పరిశ్రమ తనను తాను నిర్వహించుకోవటం; ప్రభుత్వాధికారుల నిరంకుశ అధికారం నుంచీ నియమాల నుంచీ విముక్తిని పొందటం; పెట్టుబడిదారుల దోపిడి నుంచి బయటపడటం; స్వావలంబన స్వయంప్రతిపత్తి అవకాశం ఉన్న ఉత్పత్తి ప్రక్రియ ఏర్పడటం

ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని అమలు జరపాలంటే ఆదాయాల మధ్య, ఆస్తుల మధ్యగల తారతమ్యాలకు ఒక పరిమితిని నిర్ణయించాలి. ఆ పరిమితి దాటకుండా కట్టుదిట్టంచేయాలి. అందే అప్పుడు ధర్మకర్తృత్వంలో భాగస్వామ్యం సమానత్వం ప్రజాస్వామ్యం సోదరభావం వ్యక్తమవుతాయి.

"మానసిక సామాజిక సమానత్వం ఆధారంగా ఒక కొత్త సాంస్కృతిక వారసత్వాన్ని నిర్మించాలని గాంధీజీ ఆశించారు. మానసిక సామాజిక వికాసము పరివర్తన ధర్మకర్తృత్వానికి ప్రాతిపదికలుకావాలని కూడా భావించారు. సమానత్వం, అహింస, నైతికత అనే సూత్రాలు ఆధారంగా సాంస్కృతిక పునర్నిర్మాణం జరగటానికి మార్గం ధర్మకర్తృత్వం" అంటారు జె.డి. సేఠి

## ఆదాయంపై గరిష్ఠ పరిమితి

కేవలం సిద్ధాంతం చెప్పి ఊరుకునే తాత్వికుడు కాదు గాంధీజీ. ధర్మకర్తృత్వ సిద్ధాంతం అమలు చేయటానికి ఆయన 6 సూత్రాలతో ఒక పథకాన్ని సూచించారు. (1) ప్రస్తుత పెట్టుబడిదారీ వ్యవస్థను సమ

తాయుత వ్యవస్థగా మార్చటానికి ధర్మకర్తృత్వం ఒక సాధనం. (2) సమాజం అనుమతించి మేరకు తప్ప ఆస్తిపై వ్యక్తిగత హక్కును ఈ సిద్ధాంతం గుర్తించదు. (3) సంపదపై ఆస్తిహక్కును సంపద వినియోగాన్ని చట్టరీత్యా క్రమబద్ధం చేయటం అవసరం. (4) ధర్మకర్తృత్వం క్రింద సమాజ ప్రయోజనాలకు విరుద్ధంగా వ్యక్తి తన సంపదను దాచుకోవటానికిగాని వినియోగించటానికిగాని అవకాశం లేదు. (5) వ్యక్తి ఆదాయంపై గరిష్ఠపరిమితి తప్పనిసరిగా ఉండాలి. గరిష్ఠ ఆదాయానికీ కనీస ఆదాయానికీ మధ్య తేడా క్రమంగా తగ్గుతూపోయి చివరికి హరించుకుపోవాలి. (6) ఉత్పత్తిస్వరూప స్వభావాలు వ్యక్తిగత లాభాలపైనా ఇష్టా ఇష్టాలపైన కాక సామాజిక అవసరాలనుబట్టి నిర్ణయింపబడాలి.

## పరిశ్రమల స్వయం నిర్వహణ

ఈ ఆరు సూత్రాలనూ పారిశ్రామిక ప్రజాస్వామ్యం కార్మికుల భాగస్వామ్యం ఆ భాగస్వామ్యం ప్రాదికగా ఆర్థిక వ్యవస్థ, కార్మికుల స్వయం నిర్వహణ, పారిశ్రామిక కుటుంబం, ప్రజల పారిశ్రామిక రంగం వంటి అనే సూత్రాలకు ఎతో సారూప్యం కనిపిస్తుంది.

## ఉమ్మడి కుటుంబం మునుపున్నదే !

ఆస్తిహక్కుకు మనం ఇచ్చే నిర్వచనంపై ధర్మకర్తృత్వ—సిద్ధాంతానికి సంబంధించిన ఆరుసూత్రాలూ ఆధారపడి ఉన్నాయి. "ఆస్తిహక్కు అంటే కొన్ని పరిమితులకు లోబడి కొని ఉద్దేశాలకోసం ఒక వస్తువును ఉపయోగించుకునే హక్కు. ఈ హక్కు కాలానుగుణంగా మారుతూ ఉంటుంది. ఆస్తిని సమాజ శ్రేయస్సుకోసం వినియోగించే హక్కు మాత్రమే వ్యక్తికి ఉన్నది ఈ భావనను పెంపొందించటానికే ఉమ్మడి కుటుంబవ్యవస్థ ఏర్పాటయింది ఉమ్మడి కుటుంబంలో ప్రతివ్యక్తికీ సంపాదించే హక్కు ఉండు. కాని ఆ సంపాదించిన ఆస్తిపై హక్కు మాత్రం

కుటుంబానిదే. ఆస్తి వినియోగం చిత్తం వచ్చినట్లు కాక కుటుంబప్రయోజనాలకోసం మాత్రమే జరుగుతుంది. కుటుంబం యొక్క పెద్ద ఆ ఆస్తికి ధర్మకర్తగా వ్యవహరిస్తాడు. ఈ భావననే గాంధీజీ గురూజీవంటి మనీషులు సమాజానికి అన్వయించి ప్రతిపాదించారు. సమాజాన్ని ఒక విశాలకుటుంబంగా వారు భావన చేశారు." అంటారు దీనదయాళ్ ఉపాధ్యాయ.

## ఆస్తి దోపిడీకోసం కాదు

ఆస్తిహక్కును మరో విధంగా కూడా విశ్లేషించవచ్చు, సృజనాత్మక కృషికి శ్రమకు సాయపడే ఆస్తి ఒకరకం రెండవరకం దానికి భిన్నమైన ఆస్తి తన సంస్థను తానే నిర్వహించుకుంటూ శ్రమించేవాని ఆస్తి సహజమైనది ఆరోగ్యప్రదమైనది అది మొదటి రకానికి చెందినది. ఇక రెండవ రకం. తాను స్వయంగా పనిచేయకుండా ఇతరుల శ్రమమీద జీవించే పరాన్నజీవుల ఆస్తి. అందులో సహజత్వం ఉండదు. అది ఆరోగ్యప్రదమూ కాదు. వ్యక్తిగతమైన ఆస్తి అంతా చెడ్డదనికాదు. పనికిదూరమై ఇతరుల శ్రమమీద సంపాదించబడిన వ్యక్తిగత ఆస్తిమాత్రమే గర్హించదగినది. మొదటిరకం ఆస్తితో వ్యక్తిగతమైన స్థానికమైనచిన్న తరహా పరిశ్రమలు నిర్వహించవచ్చు రెండవ తరహా ఆస్తితో నడిచే పరిశ్రమలలో ఆస్తికీ పనికీ మధ్య సంబంధం క్షీణించిపోతుంది. యజమానులకూ కార్మికులకూ మధ్యలో మేనేజర్లుంటారు. ఆ సంస్థలలో లాభాలు సంపాదించటమంటే దోపిడీ చేయటమే. న్యాయంగా ఆలోచిస్తే ఆ లాభాలను పరిశ్రమలో పనిచేసే వారందరికీ పంచాలి. ఆ లాభాన్ని తిరిగి పెట్టుబడి పెడితే ఆ పెట్టుబడిలో అందరికీ వాటా ఉండాలి. సంస్థలోని సభ్యులందరికీ నిర్వహణలో భాగస్వామ్యం ఉండాలి. ఆస్తిహక్కు కొంత సమాజపరం కావాలి. అందులకై కొంతభాగం ప్రజలకు ఉపయోగపడే పనులకూ దాన ధర్మాలకూ వినియోగించాలి. బయటినుంచి ట్రస్టీలను నియమించాలి.

# పరిశ్రమలకు బయటి ట్రస్టీలు

భారీ సంస్థలలో ప్రైవేటు ఆస్తి అనేది ఒక కల్పన సూత్రమే. సంస్థ కా ఎలాంటి పాత్రా లేని యజమానులు ఇతరుల శ్రమపై జీవించే టందుకు పన్నిన పన్నాగం .అది. న్యాయ విరుద్ధము, తర్క విరుద్ధము ఆయినది.

ఈ అనా యాన్ని తొలగించ డానికై అనేకదేశాలలో భారీ సంస్థలను జాతీయం చేస్తున్నారు. అయితే జాతీయకరణ సంస్థలలో కేంద్రీకరణ మితిమీరిపోతున్నది. ఆస్తి హక్కును వికేంద్రీకరించ టానికి స్థూలంగా ఐదు సూత్రాలు పాటించాలి.

(1) వాణిజ్యాన్ని రాజకీయాలనూ కలగా పులగం చేయటం ప్రమాదకరం ప్రభుత్వానికి ఆ సంస్థ పాలక వర్గంపై ఏవయినా హక్కులుంటే ఆ హక్కులను స్పష్టంగా నిర్వచించాలి.
(2) సంస్థలు లాభం కోసం కృషి చేయాలి. ఆ లాభాలను ప్రభుత్వానికయినా సరే పంచ కూడదు. (3) అన్ని విధాలా సామాజిక ప్రయోజనాన్ని పాటించే బాధ్యత ఆ సంస్థలకు చట్టరీత్యా అప్పగించాలి సామాజిక ప్రయోజనం ఏమిటో వ్యాఖ్యానించే పనిని ఆ సంస్థకే వదరాలి ప్రభుత్వానికి వదల కూడదు (4) సంస్థలోని ఉద్యోగుల స్థానిక ప్రజల వినియోగ దారుల న్యాయమైన ప్రయోజనాలు వ్యక్తం కావటానికి, ప్రభావం నెరపడానికి తగు వ్యవస్థ ఉండాలి. (5) జాతీయకరణ ద్వారా పెద్ద సంస్థలను ముందుగా స్వాధీనం చేసి, ఆ తరువాత అధికారాల వికేంద్రీకరణ జరపడానికి బదులు నుండు పాక్షిక స్వయంప్రతిపత్తి కలిగిన

చిన్న యూనిట్లు నిర్మించి ఆ తరువాత పై స్థాయిలో సమంజసమైన మేరకు కొన్ని విధులను కేంద్రీకరించటం మంచిది. బెలూన్లకు దారాలు కట్టి ఆ దారాన్ని చేతిలో పట్టుకుంటే, ఏబెలూన్ కా బెలూను గాలిలో ఎగిరే అవకాశం వుంటుంది. అవి చేతికి అందకుండాపోయే ప్రమాదము వుండదు కేంద్రీకరణ ఆ మాదిరిగా ఉండాలి.

## వృత్తి కేంద్రంగా సమాజం

ఇందులో ఇమిడిఉన్న మూలతత్వాన్ని ప్రఖ్యాత సమాజశాస్త్రవేత్త ఆర్. హెచ్. టానీ సూత్రప్రాయంగా ఇలా వర్ణించారు : సమాజాన్ని హక్కులు ఆధారంగాకాక వృత్తులూ విధులూ, పనులు ఆధారంగా నిర్మాణం చేయుటంలో మూడు అంశాలు గుర్తించాలి. (1) సేవా భావంతో ఉన్న ఆస్తిహక్కును ఉంచి సేవాభావం లేని ఆస్తి హక్కును రద్దుచేయాలి. (2) ఉత్పత్తిదారులకూ ఆ ఉత్పత్తిని ఉపయోగించుకునే ప్రజాసముదాయానికి సరాసరి ప్రత్యక్ష సంబంధం ఉండాలి. ప్రజా సముదాయంపట్ల ఉత్పత్తి దారుల బాధ్యతలు ఏమిటో స్పష్టంగా పొరపాటుకు అవకాశం లేకుండా నిర్ణయించాలి. ప్రస్తుతం సంస్థలు షేర్ హోల్డర్లకు లోబడి ఉంటున్నాయి. ఆ షేర్ హోల్డర్లకు లాభ దృష్టి తప్ప సేవాదృష్టి శూన్యం అందువలన సంస్థలు ప్రజా సముదాయం పట్ల తమ బాధ్యతను సక్రమంగా నిర్వహించ లేక పోతున్నాయి. (3) సమాజసేవా బాధ్యత సంస్థలో పనిచేసే వారి వృత్తి సంఘాల మీద ఉండాలి. ఈ వృత్తి సంఘాల పాత్ర వినియోగ దారుల అజమాయిషీకి విమర్శకూ లోబడి ఉండాలి

## బ్రిటన్‌లో అద్భుత ప్రయోగం

వ్యక్తి వదులుకున్న, సామాజిక ప్రయోజనం కోసం వినియోగ పడుతున్న ఆస్తి హక్కు ఎక్కడ ఉంటే అక్కడ ధర్మకర్తృత్వ సిద్ధాంతం అమలు జరుగుచున్నట్లు. ఇంగ్లండులోని ఒక కంపెనీ ఈ సిద్ధాంతాన్ని అక్షరాలా అమలు జరిపింది.

1951 లో స్కాట్ బిల్డర్ కంపెనీ సిబ్బంది 161 మంది. సాలుసరి ఆదాయం 6 లక్షల 25 వేల పౌండ్లు. నికరలాభం 7,200 పౌండ్లు. ఆ కంపెనీ పాలిస్టర్ రెజన్‌లు తయారు చేస్తుంది. ఎర్నెస్టుబేదర్ కంపెనీ యజమాని. ఆయన కంపెనీ సిబ్బందితో స్కాట్ బేదర్ కామన్‌వెల్త్ అనే సంస్థను ఏర్పాటు చేసి కంపెనీపై ఆస్తి హక్కును ఆ సంస్థకి అప్పగించాడు. ఆ సంస్థ కొన్ని ఆచరణ సూత్రాలు ఏర్పరచుకున్నది. కంపెనీ సిబ్బంది నాలుగు వందలకు మించితే మరో కంపెనీ ఏర్పరచాలి. వేతనాలలో వ్యత్యాసం 1:7 కు మించకూడదు. కంపెనీ లాభాలలో 60 శాతము పన్నులూ పెట్టుబడులకు, 40 శాతము కామన్వెల్తుకు కేటాయించాలి. కామన్వెల్తు వాటాలో సగం సభ్యుల బోనసుకు, సగం సమాజ సేవా పథకాలకూ వినియోగించాలి. కంపెనీవస్తువులను యుద్ధకృషికి అమ్మకూడదు. కామన్వెల్తు వ్యవహారాలను చూడటానికి బయటి ప్రముఖులకు ప్రాధాన్యం ఉండే ఒక ట్రస్టీల బోర్డును ఏర్పాటు చేశాడు. ఆ సూత్రాలకు లోబడి పనిచేయగా 1971 నాటికి కంపెనీ సిబ్బంది సంఖ్య 370 కి ఆదాయం 5 మిలియన్ పౌండ్లకూ, నికర లాభం 30 వేల పౌండ్లకూ పెరిగింది.

అలా ఆ కామన్వెల్తులో నిజమైన ప్రజాస్వామ్యాన్ని, సమర్థవంతమయిన యాజమాన్యాన్నీ మేళవించారు. పెట్టుబడి మనుషులకు ఉద్యోగాలు ఇచ్చే పద్ధతికి బదులు మనుషులు పెట్టుబడిని సక్రమంగా వినియోగించే పద్ధతిని ప్రవేశ పెట్టారు. ఆ ప్రయోగంలో ఆస్తి హక్కు స్వరూప స్వభావాలే మారిపోయాయి.

## బడా సంస్థలపై సత్యాగ్రహం

## పారిశ్రామికుల కుటుంబం

ఈ ధర్మకర్తృత్వ సిద్ధాంతాన్ని మన దేశంలో అమలు జరపడానికి తొలిదశగా ఇలా చేస్తే బాగుంటుందని జె.డి. సేఠీ 'గాంధీ టుడే'అన్న గ్రంథంలో సూచించారు. తమ సంపదలో కొంత భాగాన్ని వదులుకోవలసిందిగా దేశంలోని వంద పెద్ద పారిశ్రామిక వాణిజ్య సంస్థలకు నచ్చచెప్పాలి. మొదట 20 సంస్థలు తమ సంపదలో 25 శాతం, తరువాత 20 సంస్థలు 20 శాతం, ఆ తరువాత 20 సంస్థలు 15 శాతం, ఆ తరువాత 20 సంస్థలు 10 శాతం, చివరి20 సంస్థలు 5 శాతం వదులుకోవాలి. అందుకు అవసరమయితే ప్రజా ఉద్యమం సత్యాగ్రహం జరగాలి. ఆ సంస్థలు ఇందుకు ఇచ్ఛికంగా ముందుకు రాకపోతే ప్రభుత్వం ఆయా సంస్థల ఆస్తులను ఆ మేరకు స్వాధీనం చేసుకుని వాటిని ధర్మ కర్తృత్వం క్రిందకి తేవాలి. ఆ సంస్థల వారిని కూడా ధర్మకర్తలుగా తీసుకోవాలి. కార్మికుల ప్రతినిధులనుండి సమాజం యొక్క విస్తృత ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే ప్రజా నాయకుల నుండి మిగతా ధర్మకర్తల ఏర్పాటు జరగాలి.

ఇందుకు తోడు సమాజంలో ధర్మకర్తృత్వ సిద్ధాంతానికి అనుకూల వాతావరణం ఏర్పడటానికై ఆయన మరి నాలుగు చర్యలు కూడా సూచించారు. (1) పారిశ్రామిక వాణిజ్య సంస్థల షేర్లలోనూ, నిర్వహణలోనూ కార్మికులకు భాగస్వామ్యం ఇవ్వాలి. (2) ప్రభుత్వ రంగ సంస్థల నిర్వహణలో కార్మికులకే కాక వినియోగదారులకూ, ఇతర ప్రయోజనాలకు ప్రాతినిధ్యం వహించే వారికి కూడా భాగస్వామ్యం కల్పించాలి. (3) వేతన వ్యవస్థలోని వ్యత్యాసాలను తగ్గించేందుకు తగు చర్యలు తీసుకోవాలి.

(4) ఆర్థిక శక్తి కేంద్రీకరణను తగ్గించడానికీ, విలాస ఖర్చులను అదుపు చేయడానికీ తగు విధానాలను అనుసరించాలి.

## సామాజిక కాలుష్యానికి విరుగుడు

ఒక్క మాటలో చెప్పాలంటే భౌతిక వాదం తప్పు మరో విలువ లేకపోవడంతో, కోటీశ్వరుల లోభ గుణం వారిపట్ల ఇతరుల మాత్సర్యం కారణంగా సామాజిక వాతావరణంలో పేరుకుపోయిన కాలుష్యానికి విరుగుడు ధర్మకర్తృత్వ సిద్ధాంతం.



# 12

# సత్యాగ్రహం ప్రజల వజ్రాయుధం

*సత్యమూ **అహింసలను** సత్యాగ్రహంగా మలచడంలోనే ఉన్నది **గాంధీజీ** **విలక్షణ** ప్రతిభ. సత్యం **అహింస అనాదిగా** ఉన్న నైతిక సూత్రాలే. ఆ సూత్రాల **పరిధిని విస్తరింపజేశారాయన**. ఆ సూత్రాలకు మరింత లోతైన అర్థం కల్పించారు. మారిన పరిస్థితులకు అనుగుణంగా వాటిని ఆచరణలోకి **తెచ్చారు**. నైతిక ప్రవర్తన ప్రమాణాలు **రాజకీయాలలో** కూడా సమర్థవంతంగా పని **చేస్తాయని ఋజువు** చేసారు. సత్యాగ్రహ శాస్త్రాన్ని **తీర్చిదిద్ది** ఆ శాస్త్రంలో పనికి- సంఘటనకు, సంఘర్షణకు, ప్రతిఘటనకు సూత్రాలను నిర్వచించారు.*

**—ఆచార్య కృపలాని.**

దర్శనాలతో బాటు యోగాలనూ, సిద్ధాంతాలతోపాటు సాధనా మార్గాలనూ ప్రవచించటం భారతీయ మనీషుల విలక్షణ ప్రతిభ. ఆవిశిష్ట సంప్రదాయానికి అనుగుణంగానే గాంధీజీ తాను ప్రతిపాదించిన స్వదేశీ గ్రామ స్వరాజ్యం, వికేంద్రీకరణ, ధర్మకర్తృత్వం వంటి సిద్ధాంతాల అమలుకు సత్యాగ్రహం అనే సాధనాన్ని రూపొందించారు. సత్యాగ్రహ వ్రతాన్ని తాను ఆచరించి ప్రజలచేత ఆచరింప జేసారు.

## ప్రథమ సత్యాగ్రహి ప్రహ్లాదుడు

"సత్యాగ్రహం అంటే సత్యం విషయంలో పట్టుదల. నిజానికి నిలబడటం. సత్యశక్తి లేదా ప్రేమశక్తి లేదా ఆత్మశక్తి అని కూడ దానిని అనవచ్చు.

"ఈ సత్యాగ్రహ సిద్ధాంతం కొత్తదికాదు. గృహ జీవితంలో ఆచరణలో ఉన్నదే. కుటుంబ కలహాలు కానీ, కుటుంబంలో భిన్నాభి

ప్రాయాలు కానీ సాధారణంగా ప్రేమ ద్వారానే ప్రభావితమవుతూ ఉంటాయి. ఈ కుటుంబ ప్రేమ సిద్ధాంతం రాజకీయ జీవితంలో ఆచరణ లోకి రావాలి. ఎంత వరకు ఈ సూత్రాన్ని జాతులు అంగీకరిస్తాయో అంతవరకే అవి నాగరికత గల జాతులైనట్లు పరిగణించాలి.

"సత్యాగ్రహం అనే నాణానికి ముందువైపు ప్రేమ, వెనుక వైపు సత్యం...తండ్రి ఉత్తర్వులు తగనివిగా తన అంతరాత్మకు తోచినప్పుడు ప్రహ్లాదుడు వాటిని ఉల్లంఘించాడు. అందుకై తండ్రి పెట్టిన హింసలను సంతోషంగా భరించాడు. తన అంతరాత్మకు తోచిన విధంగా నడుచుకొన్న మీరాబాయిని లోబరచుకోవటానికై భర్త అనేక బాధలు పెట్టినప్పటికీ ఆమె క్షమాబుద్ధితో గంభీరంగా భరించింది. ఇలా ప్రహ్లాదుడూ మీరాబాయి ఇద్దరూ సత్యాగ్రహాన్ని ఆచరణలోకి తెచ్చారు." అంటారు గాంధీజీ.

## సత్యాగ్రహం ఒక ధర్మయుద్ధం

ఇలా సత్యమూ ప్రేమా సత్యాగ్రహానికి రెండు బాహువులుగా గ్రహించగలం. ప్రేమపూరిత వాతావరణంలోనే మనిషిలోని సున్నిత భావాలు వికసిస్తాయి. ఈ ప్రేమ భావన వర్ధిల్లుతున్న కొద్దీ, ఆచరణ ఆదర్శాన్ని సమీపిస్తున్న కొద్దీ, బుద్ధి మనోవైకల్యాన్ని లోబరచుకోగలిగిన కొద్దీ మనిషి ప్రవర్తన అంతః ప్రవృత్తిని బట్టి నడుస్తుంది. ఈ అంత ప్రవృత్తి సూక్ష్మాతి సూక్ష్మమైన హేతువాదం ప్రజ్ఞాపరమావధి కార్య రూపం దాల్చిన ప్రతిభ.

మరో ప్రక్క కసి ద్వేషం భయం పిరికితనం ఒకదాని నిచుట్టూ మరొకటి సుళ్ళు తిరుగుతూ ఉండే వాతావరణంలో ఉదారబుద్ధీ నాకయదృష్టీ వర్ధిల్లవు. కుత్సిత బుద్ధి ద్వేషభావనా ఉంటాయి. అరిషడ్వర్గాలను జయించాలనే కోరిక ప్రతి మనిషికీ స్వతస్సిద్ధంగాను ఉంటుంది. ప్రయత్నిస్తే మనిషి వీటిని మనో బుద్ధుల చేత లోబరచుకో

గలదు. కోపాన్ని జయించవలెనుకుంటే శాంతం అలవాటు చేసుకోవాలి. అప్పుడు దయ దాక్షిణ్య క్షమాగుణాలు ఉదయించటానికి తగిన మనో ప్రవృత్తి ఏర్పడుతుంది. మంచి చెడ్డలు మనకందరికీ తెలిసినవే. కానీ మన కోరికలు మన నిగ్రహాన్ని నిలువ నీయవు. గుణవంతుడుగా, సత్యసంధుడుగా ఇతరుల శ్రేయోభిలాషిగా, స్వార్థ రహితుడుగా ఉండా లనే సహజమైన కోరిక ప్రతి వ్యక్తికీ ఉండడం ఒక సుగుణం. ఈ సుగుణం పైననే సత్యాగ్రహ సిద్ధాంతం ఆధారపడి ఉంది.

సత్యాగ్రహం ఈ సత్యగుణం యొక్క ఆవిష్కరణ. ఆ విధంగా సత్యాగ్రహం ఒక యజ్ఞం. ఒక ధర్మ యుద్ధం.

## దైవమే సత్యాగ్రహికి సాధనం

సత్యాగ్రహికి ప్రధానంగా అయిదు లక్షణాలుండాలని పేర్కొన్నారు. (1) మనోవాక్కుల నిగ్రహానికి మౌనం (2) ఆహార విహారాల నిగ్రహానికి ఉపవాసం (3) భావోద్వేగాల నిగ్రహానికి బ్రహ్మచర్యం (4) సత్యాగ్రహి చేతిలో ఉన్న పరికరం దైవమే. సత్యాగ్రహి శిక్షణకు పునాది దైవభక్తికనుక దైవప్రార్థన సత్యాగ్రహికిఅవసరం (5) దారిద్ర్య స్వీకారం.

పై విధంగా సత్యాగ్రహ సిద్ధాంతాన్నీ, సత్యాగ్రహ లక్షణాలనీ సూచించిన డాక్టర్ పట్టాభి ఇంకా ఇలా అన్నారు. "సత్యాగ్రహం సనాతన ధర్మం యొక్క వ్యక్తి స్వరూపమే సత్యాగ్రహానికి ప్రేమ భ్రాతృత్వం మరియాద అనేవి మూలం. కృతయుగానికి చేరుకోవటానికి అది మార్గం."

ఆధునిక పరిభాషలో చెప్పాలంటే మనిషి స్వేచ్ఛ కోసం చేసే సంఘర్షణ సత్యాగ్రహం. వ్యక్తి తనను తాను శోధన చేసుకోవటానికి నైతికంగా ఎదగడానికీ సత్యాగ్రహం ఒక సాధనం. సమాజంలో నైతిక

సూత్రాల సంస్థాపనకు కూడా సత్యాగ్రహమే సాధనం. సమాజంలో విప్లవాత్మకమైన మార్పులు తేవాలనే లక్ష్యంతో ఆ మార్పులను గుర్తించిన ఆకళింపుతో, అందుకోసం అవసరమైతే మొత్తం వ్యవస్థనే సవాలు చేసే సంసిద్ధతతో సంఘర్షణకు సమాయత్తమైన విప్లవవీరుడు సత్యాగ్రహి.

## ప్రజా శిక్షణ - సంఘర్షణ

అహింసాయుత విప్లవకార్య పద్ధతికి ప్రజాశిక్షణ ముఖ్యమైనది. అవి రెండు విధాలు. ప్రజలలో ఆత్మ శక్తిని వికసింపజేయటం మొదటిది. విప్లవంలోని వివిధ రకాలలో వారు భాగస్వాములు కావడం రెండోది. ఇలా విప్లవానికి ముందు విప్లవ సమయంలో ప్రజలు శిక్షణ పొందుతారు. సంఘర్షణ ద్వారా ప్రజలకు శిక్షణ, ప్రజా శిక్షణద్వారా సంఘర్షణ జరుగుతుంది. ఇలా సంఘర్షణకూ ప్రజా శిక్షణకూ అవినాభావ సంబంధం ఉంది. గాంధీజీ 1920-21లో, 1930లో, 1932-33లో దేశ వ్యాప్తంగా సత్యాగ్రహోద్యమాలు నడిపారు.ఆ ఉద్యమాలు ఒకదానికన్నా మరొకటి బలీయంగా సాగాయి. ఆయన ఆయా ఉద్యమాలలో తాత్కాలిక సమస్యలకు కాక ప్రజలు అలవరచుకోవలసిన శాశ్వత విలువలకు ఆత్మానుశాసనికి త్యాగానికి నిర్మాణ కార్యక్రమానికి ప్రాధాన్యం ఇచ్చారు. సత్యాగ్రహోద్యమాల ఫలితంగా ప్రజల మనస్సులను పట్టిపీడిస్తున్న భయం-విదేశీపాలకులపట్ల భయం-మబ్బులా విడిపోయింది. పాలకుని పరువు ప్రతిష్ఠలు మట్టి పాలైనాయి. పాలకుని ప్రజల మీద పట్టు పోయింది. పాలకుల స్వరూప స్వభావాలు బట్టబయలు అయినాయి. పాలకులపట్లగల భ్రమలు తొలగిపోయాయి. వ్యవహారాలను తమ చేతుల్లోకి తెచ్చుకోవాలనే ఆలోచన ప్రజలకు కలిగింది. తమ బలమేమిటో, పాలకుని బలహీనత ఏమిటో కూడా ప్రజలకు అనుభవమయింది. అంతే కాదు ఆ ఉద్యమాలలో నుండి కొత్త నాయకత్వం ఆవిర్భవించింది.

1930-31 సత్యాగ్రహంలో 60 వేలమంది మాత్రమే జైలుకు వెళ్ళారు. అయినా బ్రిటిషువారిని గెంటివేయడం సాధ్యమేనని ప్రజలలో నమ్మకం కుదిరింది. అలాగే 1976 లో అత్యయిక పరిస్థితిలో లక్షమంది మాత్రమే జైలుకు వెళ్ళారు. అయితే ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు అత్యయిక పరిస్థితి విధించడం అన్యాయమే అనే సత్యం అనుభవంలోకి వచ్చింది. 1977లో జరిగిన ఎన్నికలలో అది రుజువైంది.

## సామాజిక పరివర్తనానికి మార్గం

ఇలా సత్యాగ్రహం ప్రజలలోని నైతిక శక్తిని మేలుకొలిపే ఒక సాధనం. నైతిక శక్తిని సమీకరించి అన్యాయాన్ని ప్రతిఘటించే సాధనం. సామాజిక పరివర్తనానికి ఒక పవిత్రమైన మార్గం.

# 13

# మానవతావాదానికి మరో పేరు

*"ధర్మ రాజ్యం ప్రజాస్వామ్యం సామాజిక సమానత్వం ఆర్థిక వికేంద్రీకరణలను మన లక్ష్యాలుగా స్వీకరించాలి. ఈ నాల్గింటి సమన్వయ సారమే నేటి పెను తుఫానుల నుంచి మనకు రక్షణ ప్రసాదించగల జీవన దర్శనాన్ని అందిస్తుంది. హిందూత్వవాదం అని పిలిచినా, మానవతావాదం అని పిలిచినా లేదా మరేదో పేరుతో పిలిచినా ఈ మార్గం ఒక్కటే భారతీయ ఆత్మకు అనుగుణంగా ఉంటుంది. ప్రజలలో నూతనోత్సాహాన్ని నింప గలుగుతుంది. దిక్కు తోచని స్థితిలో ఉన్న ప్రపంచానికి కూడ ఇది త్రోవ చూపవచ్చు."*

**—దీనదయాళ్ ఉపాధ్యాయ.**

జీవనంపట్ల సర్వసమగ్రమైన దృష్టి ఆధ్యాత్మిక విలువల ఆధారంగా రాజకీయ రంగాన్ని పునర్నిర్మించాలనే తపన, భారతీయతపట్ల మన సాంస్కృతిక వారసత్వంలోని మానవత్వపు మూల్యాలపట్ల అచంచలమైన శ్రద్ధాభక్తులు-ఈమూడు గాంధేయ సోషలిజానికి, దీనదయాళ్ ఉపాధ్యాయ ప్రతిపాదించిన ఏకాత్మ మానవతావాదానికీ మూలబిందువులు.

## గాంధీ : నేను సనాతన హిందువును

"మనిషియొక్క కార్యకలాపమంతా విడదీయటానికి వీలులేని ఒక పరిపూర్ణ ప్రక్రియ. సామాజికం, ఆర్థికం, రాజకీయం, ధార్మికం అని దానిని గిరిగీసి వేరువేరుగా విభజించలేం" అంటారు గాంధీజీ.

"ధర్మరహితమైన రాజకీయం మృత్యుదేవత కరాళదంష్ట్రి" అని ఆయన హెచ్చరించాడు. "ఆత్మసాక్షాత్కారం, దేవుడిని ముఖాముఖిగా చూడటం మోక్షప్రాప్తి-ఇదే నేను సాధించగోరేది. దీనికోసమే నేను శ్రమి

స్తున్నదీ చరిస్తున్నదీ ఈ ఆశయసిద్ధికే. ఇదే నా ఊపిరి. ఇదే నాజన్మకు సార్థక్యం. నా రచనలూ, నా ప్రసంగాలూ, రాజకీయ రంగంలో నేను చేస్తున్న సాహస ప్రయోగాలూ-అన్నీ ఈ ఆశయసిద్ధికి అంకితమైనవే." అని గాంధీజీ స్పష్టంగా ప్రకటించారు. సత్యం ఉన్నచోట జ్ఞానం, జ్ఞానం ఉన్నచోట ఆనందం ఉంటాయని కనుకనే దేవుడు సచ్చిదానంద స్వరూపుడని ఆయన వ్యాఖ్యానించారు.

"నేను సనాతన హిందువును. కనుకనే మానవాళినే కాక ప్రాణి కోటి అంతటినీ ప్రేమించగలుగుతున్నాను!" అంటారు ఆయన. నిరంతర సత్యాన్వేషణమే హిందూ ధర్మం. నేడది స్తబ్దంగా, నిష్క్రియంగా, చైతన్య రహితంగా ఉండటానికి కారణం మన అలసత్వమే. ఈ మన అలసత్వం తొలగిన వెంటనే హిందూధర్మం గతంలో కన్న సముజ్వలంగా తనకాంతి పుంజాలను ప్రపంచంపై ప్రసరింపజేస్తుంది అని చాటి చెప్పేవారు గాంధీజీ.

అలాగే దీనదయాళ్‌జీ "మన రాజనీతి, మన ధార్మిక ప్రవృత్తి ఫలితం, మనధార్మికతను రక్షించుకోవడానికి ఒక సాధనం" అంటారు.

## రామరాజ్యం ధర్మరాజ్యమే

గాంధీజీ రామరాజ్యం కోసం కలలు కన్నారు. రామరాజ్యం అంటే ధర్మం నాలుగు పాదాలా నడచే రాజ్యం. దీనదయాళ్ ప్రతిపాదించిన ధర్మరాజ్యమూ అదే. గాంధీజీ ప్రతిపాదించిన ఆదర్శ సామాజిక వ్యవస్థ గ్రామస్వరాజ్యంలో ప్రేమసామ్రాజ్యం అనే ప్రకరణలో పేర్కొనబడింది. ఏకాత్మ మానవతావాదంలోని అఖండ మండలాకార పద్ధతిని దత్తో పంత్ ఠేంగ్డే ఇలా వివరించారు; "వ్యక్తినుంచి ప్రారంభమైన కుండలిని చక్రం ఖండితం కాకుండా కుటుంబపరిధిలో కలుస్తుంది. కుటుంబ చక్రం సమాజ చక్రంలోనూ, సమాజ చక్రం దేశచక్రంలోనూ, దేశచక్రం

మానవచక్రంలోనూ, మానవచక్రం విశ్వచక్రంలోనూ కలుస్తాయి. ఈ చక్రాలన్నీ పరస్పర విరుద్ధాలుకావు. పరస్పరపూరకాలు. ఈ దశలన్నీ సత్యాలే. మన ఆత్మచేతనయొక్క విస్తృతిమీద మన వికాసక్రమం ఆధారపడివుంది. ఈ వికాసంలో ఏకాత్మత వున్నది. జీవ చైతన్యం ఉన్నది. ఇదే భారతీయమైన ఏకాత్మక దృక్పథం.

గాంధేయ సోషలిజానికి ఏకాత్మమానవతావాదానికి పోలికలు సుస్పష్టమే.

## పారిశ్రామిక కుటుంబ సిద్ధాంతం :

అదే విధంగా ధర్మకర్తృత్వ సిద్ధాంతానికీ ఏకాత్మమానవతా వాదానికీ విస్తరణగా దత్తోపంత్ ఠేంగ్డే ప్రతిపాదించిన పారిశ్రామిక కుటుంబ సిద్ధాంతానికీ సారూప్యం కానవస్తుంది. ప్రతి పరిశ్రమకూ, వృత్తికీజాతీయ స్థాయిలోనూ. రాష్ట్రస్థాయిలోనూ కార్మికులు మేనేజర్లు సాంకేతిక నిపుణులు, పెట్టుబడిదారులు ఎన్నుకున్న ప్రతినిధులతో పారిశ్రామిక మండలులు ఏర్పడాలనీ, ఆయా పరిశ్రమలకూ వృత్తులకూ సంబంధించిన వ్యవహారాలను ఆయా మండలులు నిర్వహించాలనీ వాటిలో పనిచేసే వారి యోగక్షేమాలు చూడాలనీ ఆ సిద్ధాంతం చెబుతున్నది. యజమానులు కార్మికులు ఒంటోరులకు సమాజానికి ధర్మకర్తలు అనే భావనను సన్నిహితంగా ఉంది ఈ భావన.

## సూత్రాలు నాల్గింటిలో సారూప్యం :

రాజ్య వ్యవస్థ విషయంలోనూ ఈ సారూప్యం కానవస్తుంది. రాజ్య వ్యవస్థ కేంద్రీకృతం సంఘటితం అయిన హింసకు ప్రతిబింబం. వ్యక్తికి ఆత్మవుంది. కానీ రాజ్యవ్యవస్థ ఆత్మరహితమైన యంత్రం అంటారు గాంధీజీ. కనుక రాజ్యవ్యవస్థ పాత్ర ఎంత తక్కువటుంటే సమాజానికి అంత మంచిదంటారు. ఇక దీనదయాళ్‌జీ సమాజం తన చేతనను వ్యక్త

పరచుకోటానికి రూపుదిద్దుకుంటుందని రాజ్యవ్యవస్థ అందులో ఒకటి మాత్రమేనని అంటారు.

స్వదేశీ, రాజకీయ వికేంద్రీకరణ, ఆర్థిక విశ్వాద్రీకరణ, ఆస్తి హక్కుపై పరిమితులు అనే మూలసమస్యపై గాంధీజీ దీనదయాళ్‌జీల భావ సారూప్యం ఆయా ప్రకరణాలలో స్పష్టమైంది.

అయితే గాంధీజీ భారతీయ జీవనమూల్యాలను తన కాలానికీ స్వరాజ్యసమర అవసరాలకూ అనుగుణంగా అన్వయించారు. దీనదయాళ్ జీ ఆజీవనమూల్యాలనే స్వరాజ్యానంతరం పరిస్థితులకు అన్వయించారు. అందువల్ల ప్రాధాన్యతలలో, ప్రతిపాదించే తీరులో కొన్ని వివరాలలో కొంత తేడా ఉండడం సహజమే.

ఆ మహా మనీషుల భావధారలను కలబోసుకుంటూ, వర్తమాన స్థితిగతులకు అన్వయించుకుంటూ ముందుకు సాగిపోతే భారతీయ తత్వాన్ని ఆపోసన పట్టిన మహాద్రష్టలు శ్రీ అరవింద. శ్రీగురూజీల భావ నాలోకాల కాంతి గోళాలనుంచి ఆ సిద్ధాంత సాగరయాత్రకు మార్గదర్శనాన్ని స్వీకరిస్తే-ఆరాధనీయలోకస్య (ప్రజల ఆరాధన పాలకుని పరమ కర్తవ్యం)—అనే ఆదర్శం అక్షరాలా అమలు జరిగే రామరాజ్యం భరత భూమిపై తిరిగి అవతరిస్తుంది.

# 14

# రామరాజ్యానికి రాచబాట

"స్వరాజ్యానికి రాజకీయ, ఆర్థిక స్వాతంత్ర్యాలు రెండూ రెండు ముఖాలు. సర్వవ్యాపి శాశ్వత జీవని సత్యమూ అయిన నైతిక సామాజిక ధర్మం మూడో ముఖం. నైతిక సామాజిక సముద్ధరణ అంటే అహింస నాలుగవ ముఖం. ఈ నాలుగు ముఖాలనూ కలిపి స్వరాజ్య చతురస్రం అనవచ్చు.... మనం కోరదగిన రాజకీయ వ్యవస్థను నేను రామరాజ్యం అని అంటాను. రామరాజ్యం అంటే స్వచ్ఛమైన నైతిక శక్తి ఆధారంగా ఏర్పడిన ప్రజల రాజ్యం."

— గాంధీజీ

ఆదర్శ సమాజం ఆవిర్భవించాలని మనిషి అనాదిగా కలలుకంటూనే ఉన్నాడు. కృతయుగంకోసం, సత్యయుగంకోసం, స్వర్ణయుగంకోసం, భూతలస్వర్గంకోసం తపిస్తూనే ఉన్నాడు. రామరాజ్యం కావాలంటూ కలవరిస్తూనే యున్నాడు. ఈ ఆదర్శాన్నే ఆధునికయుగంలో ఎందరో మహానుభావులు ఎన్నో విధాలుగా సూత్రీకరించారు. "మనిషిలో దైవాంశ ఉన్నప్పటికీ అతడు సామాజిక ప్రాణి. ఆ దైవాంశానికి దోహదకారిగా సమగ్ర వ్యక్తిత్వసాధనకు ఆలంబనగా సామాజిక భావనకు ప్రేరణకారిగా ఉండే సామాజిక వ్యవస్థను మనం నిర్మించుకోవాలి. అది మన ఆదర్శం కావాలి. నేటి మానవుణ్ణి వేధిస్తున్న టెర్రరిజం, హింస, సామాజిక విచ్ఛిత్తి, కాలుష్యం, వనరుల తరుగుదల అనే విపరిణామాలకు పరిష్కారమార్గం వివేకాన్నీ న్యాయదృష్టినీ స్థైర్యాన్నీ సంయమనాన్నీ అలవరచుకోవడమే. నాగరికత మనుగడకే ఈ మహా గుణాలు అత్యావసరం" అంటాడు షుమాఖర్.

"అనాసక్తిగల మానవుడే ఆదర్శ మానవుడు...దయా గుణంలో ప్రగతి మాత్రమే నిజమైన ప్రగతి...ప్రపంచంలో సుస్థిరశాంతి ఏర్పడితేతప్ప ధనంపైన అధికారంపైన ప్రస్తుతం ఉన్న వ్యామోహం తొలగితే తప్ప వాంఛనీయమైన మార్పు వస్తుందని ఆశించలేం...పరస్పర సత్ప్రవర్తన నిజమైన సమానత్వానికి నమూనా" అంటారు ఆల్డస్ హక్స్లీ.

"ఆధ్యాత్మిక స్వేచ్ఛ అంతరంగ స్వేచ్ఛ మాత్రమే ఆదర్శమానవ వ్యవస్థను నిర్మించగలదు. గాఢమైన సౌభ్రాతృత్వం నేటికీ ఆవిష్కృతం కాని ఒకానొక ప్రేమసూత్రం. ఆదర్శ సమాజవికాసానికి సుస్థిరమైన ప్రాతిపదిక అవుతుంది" అంటారు యోగిశ్రీ అరవిందులు.

"ఒకే సత్పదార్థం సర్వజీవులలో వ్యాపించి ఉన్నది. ఆ పదార్థమే అందరినీ కలిపి ఉంచుతుంది. ఆ సత్పదార్థమే పరస్పర సుఖదుఃఖాలలో సానుభూతి కలగటానికీ ఆ సానుభూతిలో ఏకాగ్రతను అనుభవింపచేయటానికీ ఆధారం. ఆ ఏకాగ్రత వేరు వేరు రూపాలలో ప్రకటించబడుతూ ఉన్నందున ప్రతివారికీ తమ తమ అభిరుచులకు అనుగుణంగా ఉత్తమ జీవనాన్ని గడిపే సదవకాశాన్ని లభింపజేయటమే పరమ కర్తవ్యం" అంటారు శ్రీ గురూజీ.

"ప్రాచీన సంకేత స్తంభంపై పెద్ద పెద్ద అక్షరాలతో లిఖించబడి ఉన్న శబ్దం ధర్మం. రాజ్యం ధర్మానికి అధీనం...ధర్మ భావన భారతీయ రాజ్య వ్యవస్థలోనూ, విస్తృతమైన సామాజికజీవనంలోనూ దాని భూమిక-ఈ రెండూ సమన్వయపూర్వకమూ చైతన్యవంతమూ అయిన సాముదాయిక సంఘటనకు ప్రధాన లక్షణాలు...సమాజం యొక్క చైతన్యవంతమైన స్వరూపం నిర్ణయానికి ప్రతినిధి ధర్మం...మన రాజకీయ వ్యవస్థను స్థిరమైన పునాదులపై నిర్మించాలంటే ఆది నుంచి మనకున్న భావం కావాలంటే, అది భారతీయ సమాజ వ్యవస్థ సమస్యలకే పరిష్కారం, పునర్నిర్మాణం,

శక్తి ప్రదానం చేయాలంటే-దానికి పైన చెప్పిన భారతీయ ప్రతిభ ఆధారం కావాలి. మనరాజకీయవ్యవస్థను చైతన్యవంతమై, స్వయం నిర్ణయపూరితమై, ఆత్మవికాసశీలమైన సాముదాయిక జీవనంతో ముడివేయాలి. రాజ్యాంగ స్వరూపాలకు, రాజకీయ వ్యవస్థలకు మాత్రమే సంబంధించిన ప్రశ్న కాదిది. చాలా మౌలికమయిన సమస్య. అతి ప్రాచీనమైన ఒకదేశం తాను కోల్పోయిన తన ఆత్మను పునఃప్రతిష్ఠ చేసుకునే సమస్య ఇది" అంటారు జయప్రకాశ్ నారాయణ్.

గాంధీజీ సత్యం అని పిలిచినా, షుమాఖర్ మహాగుణాలు అని పిలిచినా, హక్స్లే పరస్పర సత్ప్రవర్తన అన్నా, అరవిందులు ఆధ్యాత్మిక ప్రేమసూత్రం అన్నా, గురూజీ ఏకాత్మభావన అన్నా, జయప్రకాశ్ చైతన్యవంతమైన స్వయం నిర్ణయానికి ప్రతినిధి ధర్మం అని చెప్పినా, దీనదయాళ్ జీ పరస్పర అనుకూలత అన్నా మూలతత్వం ఒక్కటే. అదే ధర్మం- విశ్వజనీనమైన నైతిక మహాసూత్రం.

ఆ ధర్మదేవత - "జగముల చిరునగవుల పరిపాలించే జనని." ఆ ధర్మదేవత పాదసన్నిధి మానవతకు పెన్నిధి. ఆమె అందెలరవళిలో సామగాన సరళి ఉంది. ఆమె వరద హస్తంలో క్రియాశక్తి సమస్తం నిమిడి ఉంది. ఆ ధర్మ దేవత హాసరేఖ శాంతి సౌహార్దాల తేనెవాక. ఆ ధర్మదేవత చల్లని కడగంటి చూపు ప్రకృతిమాత పూలజల్లు. ఆ ధర్మ దేవత కజ్జలరేఖ కళలకు కల్పవల్లి. ఆ ధర్మదేవత కరుణామృతమే సత్యం శివం సుందరం.

**ధర్మదేవత ఉపాసన రామ రాజ్యానికి రాచబాట.**

**ధర్మదేవత సాక్షాత్కారం రామరాజ్యానికి చరమసీమ.**

# వెలుగు దివ్వెలు

గాంధేయ సోషలిజాన్ని మరింత విస్తృతంగా అధ్యయనం చేసే వారికి ఉపకరించగల గ్రంథాలు కొన్ని :



1. గాంధీ - గాంధీ తత్వము
   డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్య,
   ప్రభాత ప్రచురణ సమితి, ఖమ్మంమెట్టు.

2. రాష్ట్ర జీవన్ కీ దిశా (హిందీ) 
   దీనదయాళ్ ఉపాధ్యాయ 
   రాష్ట్ర ధర్మ పుస్తక ప్రకాశన్, లక్నో.

3. భారతీయ అర్థ వ్యవస్థ (హిందీ)
   దీనదయాళ్ ఉపాధ్యాయ 
   రాష్ట్ర ధర్మ పుస్తక ప్రకాశన్, లక్నో.

4. సమగ్ర దర్శన్ (హిందీ)
   శ్రీ గురూజీ
   భారతీయ విచార సాధన, నాగపూర్.

5. విచార సూత్ర (హిందీ)
   దత్తోపంత్ ఠేంగ్డి
   భారతీయ శ్రమ అనుసంధాన కేంద్ర,
   185, శనివార్, పూనా.

6. Socialism of my Conception
M.K. Gandhi
Bharatiya Vidya Bhavan, Bombay

7. Gandhian Thought
J.B. Kripalani
Orient Longmans, New Delhi - 1

8. Gandhi and Man
K.G. Mashruwala
Navajivan Publishing House, Ahmedabad.

9. Gandhi Today
J.D. Sethi
Vikas Publishing House, New Delhi

10. Equality Through Trusteeship
V.L. Mehta,
Bharatiya Vidya Bhavan, Bombay

11. The Message of Mahatma Gandhi
Compiled by U.S. Mohan Rao,
Publications Division, Government of India.

12. Integral Approach
Deendayal Upadhyaya
Deendayal Research Institute, New Delhi.

13. Gandhi Lohia Deendayal (Hindi & English)
Collection of Essays
Deendayal Research Institute, New Delhi.
14. Foundations of Indian Culture
Sri Aurobindo,
Sri Aurobindo Library, Newyork City.
15. Small Is Beautiful
B F. Schumacher
Radha Krishna, Daryagunj. New Delhi.
16. Labour Policy
D.B. Thengadi and others
Bharatiya Mazdoor Sangh,
Badkar Chowk Mahal, Nagpur-2.
17. Our National Renaissance,
D.B. Thengadi,
Sahitya Sindhu, Bangalore-560 019.
18. Ends and Means
Aldous Huxley
Chatto and Windus, London.